[illegible] 5

వి. ఆర్. జగపతివర్మ

సంపాదకుడు

# గుణరత్నావళి

గ్రంథకర్త



బాలకవి భయంకర వెదురుమూడి

రామలక్ష్మీ నృసింహారావు

గోల్డెన్ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

రాజమండ్రి.

వెల రు 0—10—0

# సంపాదకీయ భూమిక

గుణరత్నావళియను నీనవలను వ్రాసిన గ్రంథకర్త బాలుఁడు. ఇంతబాల్యముననే (17 వత్సరముల వయస్సున్న) నీగ్రంథమును నిర్దుష్ట శైలిలో వ్రాసిన గ్రంథకర్త యెడల మాకు గలిగిన యభిమానమే యీ మాప్రచురములలో ప్రకటించుకొనుటకు కారణము. అంతియగాక యీగ్రంథమునుకూడ నొక నవీనమార్గమును ప్రదర్శించుచున్నదని మాయాశయము. ఇట్టి గ్రంథములు దేశభాషాభిమానముల నభివృద్ధిపఱచుట కెంతో యుపకరించునని తోఁచెడిని.

గ్రంథపాఠకులు సాంతముఁగ చిత్తగించి అందందుఁగల స్వల్పదోషములను గ్రంథకర్తకు తెలిపి యీబాలకవి నభివృద్ధి పఱతురు గాతయని కోరుచున్నాము.

సంపాదకుఁడు.

# పీఠిక.

సోదరులారా!

నేనీ చిన్న నవలను గత వత్సరము జూలై పదవ తారీఖునఁ బ్రారంభించి యిరువదిరెండవ తారీఖునకు ముగించితి. తత్పూర్వము నాలుగు నవలలను కవిత నభ్యసించుచు వీలుపడినతరి రచించితి. కాని యవి నా ప్రథమ గ్రంథము లగుటచేతను మిక్కిలి పిన్నవయస్సుననే రచించినవగుటచేతను వానిఁ బ్రకటింప కుతూహలము లేక ప్రకటింపనయితి. నాకిప్పుడు సుమారు పదునేడు వత్సరములు కలవు. (అనగా నాజన్మ వత్సరము విళంబినామ సంవత్సర భాద్రపద బహుళ ద్వాదశీ గురువారంబునకు సరియగు హూణశకము 1898 వ సం|| 1వ అక్టోబరు నెల) మఱియు, యింతటి చిన్న వయస్సున గ్రంథముల రచించి ప్రకటించుట యంతగా నర్హము గాకపోయినను, పిన్ననాటనుండియు నాకు మాతృభాషయందుఁ గల ప్రేమయు, కవితనభ్యసించిన యనంతరంబ నాకుఁ గలిగిన బిరుదమును, పొందిన ప్రజ్ఞాపత్రములును, సంగాతకాండ్రవాక్కులును, ముఖ్యముగ నావాణి ప్రోత్సాహకతంబునను, యాదిని నామతప్రియంబై, సకలభక్తులకు బఠనీయంబై మోక్షపథంబుఁ గనుఁగొన నాధారంబగునట్టుల ,,హరివాసరసుమమ"ను పేర రుక్మాంగద చారిత్రంబు ప్రబంధరూపకంబుగ ప్రథమభాగంబును రచించి ప్రకటింపఁజేసితి. తదనంతరంబ పై నుడివిన ప్రోత్సాహమువలననే యీచిన్న నవలను వ్రాసి ప్రకటింపఁ గుతూహలాయత్తచిత్తుడనై యీనగరంబునఁ గల ,,గోల్డెన్ ముద్రాక్షరశాల" యందీ ప్రత్తమును ముద్రణమునకై యిచ్చినాఁడ. కొన్నిదినముల యనంతరంబ ,,ఆంధ్రసారస్వతనికేతనాధికారులగు వి. ఆర్. జగపతివర్మ గారిని ముద్రణాలయమునఁ గలుసుకొనుట తటస్థంబయ్యె. అంత ప్రసంగవశమున వారు నేఁరచించిన నవలను తమ ప్రచురములోఁ జేర్చుకొనెద

మివ్వవలయునని కోరిరి. అందులకు నేను సంతసమునఁ నంగీకరించినాఁడ. కాలనిర్ణయ మొక వత్సరము మాత్రమే.

ఇంతవరకు నేరచించిన గ్రంథములలో (1) 'గుణరత్నావళి' య నెడి యీనవలయు (2) 'హారివాసరసుమమ' నెడి ప్రబంధమునందలి ప్రథమభాగంబును ప్రకటితములైనవి. (3) 'ఆనందుఁడు' యనెడి మఱి యొక నవలయు (4) హేమకశ్యప విజయంబను వచనకావ్యంబును (5) స్వర్గపాయియను గ్రంథమునందలి ప్రథమభాగమును గతిపయదివసంబులలో వెలువడును.

ఈగ్రంథమతిత్వరితముగ రచించుటచేతను, వ్రాసిన చిత్తు ననుసరించియే ముద్రించుట వలనను హూణభాష నభ్యసించుచుండుటచేతను పరీక్షల తొందరలవలనను మున్నగు హేతువులవలన శుద్ధపత్రముల జాగ్రత్తగ దిద్దకయు నొకానొక సమయమున శుద్ధపత్రముల దిద్దుటకు కాలములేక వారలనే చిత్తుంబట్టి చూచి ముద్రింపవలయునని యడుగుట వలనను, కొన్నిస్థలములందు ముద్రాపకులు తమయిచ్ఛచొప్పున ముద్రించుట వలనను బాలుఁడొనరింపని తప్పులు సహితము మెండుగ దొరలినవి. ఇందుఁగల వ్యాకరణాది తప్పులను సవరించి శుద్ధపత్రిక వ్రాసెదనేని మఱి యిన్ని పత్రంబులు పట్టును. తత్కారణంబున శుద్ధపత్రికం బ్రకటింప లేదు. ద్వితీయముద్రణము త్వరితగతి యవసరం బయ్యెనేని యందు వలయు మార్పులఁ జేసెద.

బుద్ధిమంతులగు వారలెల్లరీ గ్రంథమును జాగరూకతతోఁ బఠించి జలమిశ్రితంబైన పాలలో జలమును విడనాడి క్షీరంబు మాత్రంబె గ్రో

లురాయించ కరణి యిందుఁగల దోషంబులఁ ద్రోసిపైచి, గ్రంథరచనయందు నాయభిప్రాయంబును, యిందుఁగల నీతులను గ్రహించి జ్ఞానవంతులయ్యెదరుగాత.

నాప్రజ్ఞా పత్రములనెల్ల ( *Testimonials* ) నొకపాత్రంబుగఁ బ్రకటింపనెంచి యిందుఁ జేర్పలేదు.

ఇట్లు
విద్వజ్జన విధేయుఁడు
గ్రంథకర్త.

రాజమహేంద్రవరము
1—5—15

అభిప్రాయవిరుద్ధంబుగ ముద్రించిన కొన్నిదోషంబులీక్రిందఁ జూపఁబడినవి.

## శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 15 | విలూపాక్షిని | విరూపాక్షుని |
| 3 | 15 | శస్త్రపరిజ్ఞానంబు | శాస్త్రపరిజ్ఞానంబు |
| 5 | 23 | కంఠనము | కంఠము |
| 8 | 3 | సీమన్తినులనధి ష్ఠించి | సీమన్తినులధి ష్ఠించిన |
| 10 | 2 | విలువింద్య | విలువిద్య |
| 13 | 1 | జాగులు | నాగులు |
| 14 | 20 | విశ్వేరుని | విశ్వేశ్వరుని |
| 15 | 3 | విశ్వేరా! | విశ్వేశ్వరా! |
| 15 | 23 | కళ్యాకటము | కళ్యాణకటకము |
| 24 | 11 | హోమకంచము | హేమకంచము |
| 33 | 9 | సముస్కృత | సంస్కృత |
| 37 | 1 | సూన్యమై | శూన్యమై |
| 41 | 10 | ఇప్రతిభా | ఈప్రతిభా |
| 44 | 13 | ఈ॥ భజించుట | భుజించుట |
| 45 | 22 | పరాంకితము | నరాంకితము |
| 50 | 16 | సద్గతి | సఙ్గతి |
| 51 | 1 | అనోకహము | అనోహము |
| 61 | 4 | సిలల్వ | సిలన్వ |
|  | 5 | పల్లటే | పల్లటి |
|  | 12 | నిబ్బురపు | నిబ్బరపు |
|  | 17 | పట్టిన | పట్టున |
| 62 | 1 | ఘుల్బులా | ఘుల్ఘులా |
|  | 6 | రుచిత | రుచిగ |
| 63 | 20 | సీ॥ ఎద్దరైన | ఎదురైన |
| 74 | 4 | యూరాష్యులు | యూర్ష్యలు |
| 77 | 19 | రంగరాజు | గజపతిరాజు |
| 80 | 19 | స్నిష్ఠ | స్నిష్ఠ |
| 93 | 8 | దారుణంబు | దారుణంబగు |
| 101 | 15 | మృగందాది | మృదంగాది |
| 102 | 14 | గ॥ మధ్య కుల | మధ్వకుల |

ఇందువ్యాకరణాది దోషముల పత్రికఁ జేర్పలేదు.

శ్రీ హయగ్రీవాయనమః

# గుణరత్నావళి.

## ప్రథమప్రకరణము.

చ॥ “ జలనిధికన్యకాఘన కు । చస్థలి పచ్చలతాళిగోపికా
విలసితహారమధ్యమణి । విశ్వజగద్వలయప్రకాశకో
జ్వల మహనీయరత్నమని । వారితకాళియ భోగిభోగ మం
డలగిరివజమై వెలయు । నందతనూజు భజింతునామదిన్ ॥ ”

ఇట్లు కార్యసిద్ధికై కమనీయకోటీర కౌస్తుభాలంకారుడును, సకల గుణగంభీరుడును, అమలప్రసంచార యఖిలార్తిహరుడును, సకల లోకవాసుడునునగా భగవానుని పాదంబులకు సహస్రవందనంబు లాచరించి, వాని కంకితంబుగా నర్పించి, కథాప్రారంభముగావించెద:—

తొల్లి భరతఖండము శ్రీ లలనాధివాసమై, చెన్నైసలార్చి, సరస్వతీ విలాసాలయమై, దివ్యవిభూతులకు సన్నిధానమై, ధరారమణీకంచితనూపురమై, ధీలతకాలవాలమై, వింతహరువులపనులచే విస్తరిల్లిగ్రాలెనంచు మనప్రాచీనులు వక్కాణింతురు.

ఇట్టి జంబూద్వీపమునకు పూర్వపార్శ్వమున బంగాళాఖాతమును ప్రతీచినినరేబియాసముద్రమును, దక్షిణమున హిందూమహాసముద్రమును, నుత్తరమున మహోన్నతమగుహిమవత్పర్వతపంక్తియుఁ గలదై యొక కోటవలెనుండి దేశమును శత్రువులనుండి రక్షించుచున్నయది.

ప్రపంచమునఁగల గోత్రములలోనెల్లను హిమవత్పర్వతము మహోన్నతమై, యార్యావర్తమునకుఁ దూర్పునుండి పడమరవఱకును సుమారు పదునెనిమిదివందల మైళ్ళవఱకును వ్యాపించి, భగవన్నిర్మిత శిలాకుడ్యముచందంబుననుండి, తన యౌన్నత్యమును, గాంభీర్యమును ప్రపంచమున వెలువరచి శైలరాజరాజంబని ప్రసిద్ధిగాంచుచున్నది. ఏగోత్రంబు రాజబ్రహ్మాది ఋషిగణంబులకును, నరసిద్ధసాధ్య విద్యాధర సురకన్యకలకు నాకరంబో, ఏశైలంబు నిరంతరమును హిమమునకుఁ నెలవై హిమవత్పర్వతనామముఁ సార్థకముగాంచుచున్నదో, ఏకుధరంబు బహు జవసత్వముతో నెల్లప్పుడుఁ బారుచు, భువనమును పావనముఁజేయుచున్న గంగ సింధు బ్రహ్మపుత్రాది నదులకు స్థానంబో, ఏయద్రిరాజము విరూపాక్షునిభార్యయైన పార్వతిఁ గనెనో, యాహిమవంతంబమూల్యరత్నరాసులతో, వివిధ దివ్యౌషధములతో సురుల కన్నసత్రమై పరుల హృదయముల రంజింపఁజేయుచు, నాశ్చర్యభయాతిరేకంబులచే నాయనంతునిమహిమల వెల్లడిచేయుచుండు. ఇందుఁగల శృంగములలో "గౌరీశంకర్" యనునది మిగుల గొప్పది. ఈపర్వతమున కుత్తరమునఁ గంగజనించి లక్నో, పాట్నా, వారణాసి మున్నగు పట్టణములకు సమీపముగ బారి యంత్యమున బంగాళాఖాతమునఁ బడుచున్నది. ప్రపంచమునఁగల నదులలోనెల్ల నిదియే ప్రథమమున నెన్నదగు. దీనిని భూలోకమునకుఁ బ్రప్రథమమున సూర్యవంశపురాజైన భగీరథుఁడు తీసుకొని

వచ్చెనని పురాణంబులఁ గాంతుము. ఈగోత్రమున నుత్తరపార్శ్వమున నే కైలాసంబున సింధు జన్మించె. సుమారీనదీమతల్లి పదునెనిమిదివందల మైళ్ళ పొడవుకలదై, పెద్దచెలియయో, లేక చెలియలిబిడ్డయో యను నట్లు కొంతదనుక టిబెట్టుదేశమునఁ బ్రవహించి యనంతరము పంజాబుఁజొచ్చి, యవల సింధుదేశమునఁ బ్రవేసించి బహుయుపనదులఁ గలసి యచ్చటనుండు పౌరులకును, సస్యాదులకు నాధారభూతంబగుచు, ప్రవహించి యంత్యమున పశ్చిమసముద్రమునఁ సంగమించుచున్నది. గంగ యందు సంగమించు నదులలోని కెల్లను గొప్పదయు, ప్రఖ్యాతివడసిన దియునగు యుపనది యమున. దీని యొడ్డున నింద్రప్రస్థమను పట్టణరాజం బొండు దనరారుచుండు. పూర్వమే నిగమము పాండురాజనందనుల రాజధాని యయ్యెనో, నేపత్తనము శత్రువులు చొర నశక్యములగు వరణములచే నావరింపఁబడెనో నేపుట భేదనము సరసిద్ధాది యోగిజనసమాశ్రయవాసస్థాన మయ్యెనో, నేస్థానము శిఖావలపీఠమున కునికిపట్టయ్యెనో, యేపురమత్యంతకుశలస్వాంతంబుల వేదవేదాంగాది బ్రహ్మవిద్య, కౌశిక్కంబును, గవిత్వంబును, శస్త్రపరిజ్ఞానంబును, శకునంబును, సాముద్రికమును, నరదంబుఁ బరవుటయు, దురగారోహణంబును, మల్లశాస్త్రంబును లిపిలేఖనంబును, రయస్తంభనంబును, జలాగ్ని స్తంభనంబును, నింద్రజాలంబును, మహేంద్రజాలంబును, జూదంబును, మున్నగు విద్యలయందుఁ గడితేరిన పౌరులకు నివాసమయ్యెనో, యాస్థాన మమూల్యరత్నములతో వింతవింత హరువుల పనులచే విస్తరిల్లి జిలుఁగు సేఁతలరీతుఁల జెన్ను మీరి వన్నెచిన్నెలయందు వాసికెక్కి నేతలఁపోతల చిత్తరువాతల నిర్మాణములను వాసిఁగని నాశ్చర్యముతో మన పూర్వుల యనంత మహిమను బ్రకటింపుచుండు. ఇట్టి యింద్ర ప్రస్థనగరమున

కిప్పుడు ఢిల్లీయనిపేరు. ఆదేశము మహమ్మదీయుల స్వాధీనమైన తరువాత నింద్రప్రస్థనామము కాలక్రమమునఁ మారిపోయి ఢిల్లియనుచు వ్యవహరింపఁబడుచువచ్చెను. ఆనామమె యిప్పటికిని ప్రఖ్యాతియందున్నది. ఈ పట్టణము పూర్వము మహమ్మదీయులు మున్నగు వారలకుఁ జిరకాలము ముఖ్యపట్టణమై ప్రస్తుతము హూణరాజ్యమునకును రాజధానియైమహదైశ్వర్యమనుభవించుచున్నది.

1678 వ సంవత్సరమున నొకనాఁడు వజ్రవాతను సింహబలుఁడను క్షత్రియుఁడు భార్యయగు హేమావతిని, నష్టవర్షప్రాయయగు కుమారికను, దీసికొని నివాసస్థానమైన యింద్రప్రస్థమువదలి సంపతు నగరమునకుఁ బయనమయ్యెను. సంపతునగర మింద్రప్రస్థమున కిన్నూరువందల పరుగులుకలదు. ఆకాలమున ధూమశకటములు లేమింజేసి నాటునబండ్లపై పయనము సాగింపవలసి వచ్చెడిది. ఇప్పటివలె సరియగు బాటలును రస్తాలును లేవు. ఎచ్చట చూచినను కాననములే. ఏవైపు కాంచినను బందెగాండ్ర భీతియే. మాతయు గూతురును పనికత్తెయగు హేలయు నొక బండిలో నధిష్టించిరి. సింహబలుఁ డొకఁడును రెండవశకటములో గూర్చుండెను. పయనము మిక్కుటమగు దూరమును కాలమును, సాగింపవలయును. కాన నొక బండియందు వంటసామగ్రిని నైచిరి. హేమావతి చీనీచీనాంబరములును, నవరత్న ఖచితాభరణములును, సింహరాజు కాచపాత్రములు వెండి సువర్ణపాత్రములు మున్నగమూల్యములైన వస్తువులన్నియు సింహబలుని బండిలోనే యుండెను. బండి వెంటనంటి సేవకుఁడు నడచుచుండెను. వారిట్లు కొలదిదివసముల కేఁగూరు సామీప్యమునఁ వి

లసిల్లు సాంబప్రస్తమను పల్లియను చేరిరి. వారచ్చట విడియుసరికి సుమా రిరుశోదయమున నైదు గడియల ప్రొద్దెక్కినది. వారాయూర నొక స త్రివసం విడసి వంటలఁ జేసుకొని భుజించి సేరాని పడకలవైచి యలసటఁ దీర్చుకొని రెండు గంటలకాలముసఁ బండ్లు కట్టిరి. ఆదినమమవాస్యానూ తన మంగళవారము. ఇంతియేకాక వారు శకటములపై నారోహించు ట కేగుసరికొక సాతాసనాలెమరుగవచ్చి ఁటాలున తుమ్మెను. అంతట హేమావతి గుండెలు జల్లుజల్లన భీతిచేతస్కూరాలై భర్తతో ‟ఓప్రాణ నాథా! యీదినమునకుఁ బయనమాపుము. ‟విఘ్నేశ్వరుని పెండ్లికి వే యి విఘ్నము” లన్నట్లు మనము పయనము సాగించిన దాదిగా ననేక విఘ్నసూచికములు పొడగాంచుచున్నవి. అందునేడమావాస్య మంగళ వారము. ఒకవేళ ప్రొద్దైనున్నదేమో యనిన నున్న. సరియగు మార్గ ములేదు. దేశము పర్వతమయము. కుధరముల నడుమనుండియు దట్టము లగు విపినములమధ్యనుండియు ప్రయాణముచేయవలెనట” యనెను. అం తట భర్త కోపచేతస్కుండై గద్గదస్వరముతోఁ ‟ఎప్పుడు నాడువాండ్రతోఁ బ్రయాణము సాగింపరాదు. తెలియనివారు తెలియనట్లుండరు. ఏపని త లచిన నడ్డము వత్తురు. ఇంతలోనే మనకు మహాప్రళయము సంభవించు నా? సంభవించినది గృహమునఁగూర్చున్నను సంభవింపకుండునా? పిచ్చి మాటలు. బండ్లు కట్టుము, కట్టుడన”గానే బండివాండ్రుబండ్లఁగట్టిరి. బాటసా గించిరి. తిరిగి సింహరాజుమాటకు బండివాండ్రుగాని, భార్యగాని, ప్రత్యు త్తరముఁ జెప్పజాలకపోయిరి. బండివాండ్రు ముందటి గ్రామమునకుఁ త్వ రితగతి బోవలయునని తమ యెద్దులను గొట్టియు వాలముల మెలిపెట్టి యుఁ బప్పప్పా, ఛల్ ఛల్ యని హెచ్చరించియుఁ ద్వరపెట్టఁజొచ్చిరి. ప్రొద్దుగ్రుంకె. వృషభముల కంఠసమునఁ గట్టబడి దేదీప్యమానముగాఁ

బ్రకాశించుచున్న యనేక ఘంటలయొక్క ప్రళయకాలధ్వనులవంటి క ఠినమైన ఘణంఘణయనెడు ధ్వనులు బహుసత్వముతోఁ బహుదవ్వు వినఁ బడుచుండెను. బండ్లు చిన్నచిన్న గుట్టపై నెక్కి పల్లపుప్రదేశమునకుఁ ది గునప్పుడుఁ గల్లు గుభాల్ గుభాల్ మను ధ్వనులు మిక్కుటముగా కర్ణ ములకు వినఁబడుచుండెను. క్రిందహఠాత్తుగా పడకుండ వసిశ్ఠను హేమా వతి గట్టిగా పట్టుకొని తాము బయలుదేరినతరి తుమ్మిన యాయంగనను దూషింప మొదలుపెట్టెను. ఎల్లెడను వ్యాపించిన యంధకారమును సింహా రాజునకుఁ దక్క మిగిలిన వారలకెల్లను భయముఁ గొలిపెను.

## ద్వితీయ ప్రకరణము.

నానాముఖముల వ్యాపించిన యంధకారము రీతిని వెంట బండి నంటి నడచుచున్న చాకలి యమ్మిగానికిని, హేల, హేమావతి, కూతు రు గుణరత్నావళికిని భయమంతకంతకు హెచ్చఁజొచ్చెను. కమ్మినది కా రుచీకటి. అందమావాస్యనిశ. నిర్జనప్రదేశము సరియగు సరణిలేక ప్రస్త ముల పై బోవుటంజేసి శకట చక్రములక్రిందఁబడి నలిగి కలుగు పటపటనా దములు వినఁబడుచుండెను. ఆనోహములనుండి స్వల్పపులుగుల ధ్వనులు "జుయ్ జుయ్" యటంచు కర్ణరసాయనములగుచుండెను. అగ్నిదేవునకుఁ వాయుదేవుఁడు సాయమయినట్లు తమిస్రమునకుందోడు కారుమేఘములు తోడయ్యెను. చిన్న చిన్న వర్షబిందువులు పడనారంభించెను. అకటా! వారి యవస్థ యేమని వర్ణింపవచ్చును. అట్టిస్థితిని వర్ణింపఁ నాయాదిశేషు నకైనను నసఖ్యంబ. అంతట గుణరత్నావళి యొడలు గడగడ వడంక,

వాయాడక మెట్టకేలకు "నాయనగారూ! మాకు భయముగానున్నది. మీరువచ్చి మాశకటంబున నధిష్ఠింపుము" అని కేక వేయ జనకుఁడు "అమ్మా! ఏమిభయము. తమమయమయినది. మీయమ్మయొడిలోఁ బండుకొని నిద్రింపుము. భయమేమిటి. పిచ్చిపిల్ల"వని చెప్పి చాకలి య మ్మిగానిని వారల బండి వెంటనంటి మాటలఁ జెప్పుచుభయముఁ బోగొ ట్ట వలసినదని యాజ్ఞాపించెను. పలుమారు హేమావతి యమ్మిగానిని పి లిచి ముందఱ పల్లియ యెంతదవ్వున్నదని యడుగుటయు వాఁడు మతిపో యినవానివలె నొకసారి పదికోసులున్నదనియు, మఱియొకసారి రెండు మైళ్లున్నదనియు, సంబంధములేని మాటలాడఁజొచ్చెను. ఈపలుకులామె భయమునకుఁ దోడై భయము హెచ్చఁజొచ్చెను. ఆమె గుండెలు పీచు పీచు మనుచుండెను. ఈవిధమున వారలూసుపోఁపుటకై యేవియోకొన్ని మాటలఁ జెప్పుకొనుచు సద్దతిని కొంతదవ్వేగునప్పటికి కొంతదూరమున మ నుష్యుల పాదవినాదములు చెవులఁబడెను. అంతకంతకు సమీపముగ వినఁబడెను. ఏరైయుందురో యని వీరెల్లరు నలుదిశలఁజూడ దక్షిణది గ్భాగమునుండి పదునారుగురు మనుష్యులు తారుణ్యవంతులు, భుజము ల పైపరశువులను కత్తులను బాకులను విండ్లనమ్ములను వైచుకొని మూఁడు దీటీలను వేయించుకొని యొకమలుపుఁ దిరిగి పదిగజములదూరములోఁ గాన్పించిరి. అప్పుడు హేమావతికి గుండెలలో ప్రాణములు గుండియల లోలేవు. పిల్ల అమ్మో భయమని తల్లి మెడ కఱచుకొనెను.

పనికత్తెయగు హేలయు మిక్కుటమగు భయమున "అమ్మో లక్ష్మో' యింకేమున్నది. చచ్చితినమ్మోయని బొబ్బలిడసాగెను. ఇం తలో హేమావతి ధైర్యము దెచ్చుకొని యరువవలదని హేలను మం దలించెను. బళ్ళలోవారులు శకటములఁ దాపించిరి. అందిఱువురు మంచి

తారుణ్యవంతులు, పించండీలులు, ఖరణసులు, ముందొక శకటమును నడ్డగించి పోలులోఁ గూర్చున్నవానిని దండమర్దనంబుఁగావించి ధరిత్రిపై పడవైచిరి. మఱియొక మాణవకుఁడు సీమన్తినుల నధిష్ఠించి శకటముందాపించి వృషభములఁ విడచి పోలులోఁగూర్చున్న శకటాధిపతిని హస్తములచే కేసరములఁ లంఘించి యొకని కుంజపుంజము చాటునకుఁ గొంపోయి మర్దించిరి. ఇంతలో నాదిశకటమును నాపుచేసిన తోహరుఁలు యోషితల సమీపించి కంఠంబులనున్న యలంకారముల గైకొన యత్నించిరి. కాని త్వరితగతిని సింహబలుఁడు తనమొలలోనున్న ఖడ్గమునుదూసి శకటంబునుఁడి గుబాలున దుమికి ప్రతిపదర్శినుల శకటమును నిలవేసి, కంఠంబునంగల భూషణములఁగైకొన యత్నించిన వారలంకాలలోక నివాసులంజేసి సింహబలప్రతాపముఁజూపె. నాల్గవవాఁడు వెనుక మరలి పరుగెత్త నారంభించెను. హేల ,,అమ్మయ్యో నాయనో" యని బొబ్బలిడఁజొచ్చెను.

హేమావతి కుమరికం దీసికొని యానోహపదుగు చాటునం దాగె. అంతట సింహరాజు మడేలమ్మిగానిని భార్యవద్దనుండ నియమించి తాను ముందువైపునకు వచ్చి చోరులపైఁబడి కొందరిహస్తములను కొందరినాశికములను ఖండించె కాని షోడశులపై నొక్కడెంత? కనుమేం దూరమునుండి మువ్వురు సింహబలునిపై నమ్ములఁవిడిచిరి. అవి వక్షస్థలమునందాకి నెత్తురు వెలువలై పారుచుండెను. మఱిమువ్వురు ఖడ్గములతో వానిభుజములపై గట్టిగాయములంజేసిరి. ఇట్లే కాయమెల్ల గాయములచే నిండెను. బండివాండ్రెను వృక్షములకుఁ గట్టివేయుటంజేసి సింహబలుని కేవిధమైన సహాయమును చేయజాలరైరి. ఇఁక మడేలమ్మిగాఁడు జీవించినను మృతినొందినట్లే. పొదచాటునుండి యలసి బహుగాయములఁదిని పడిపో

పుటకు సిద్ధముగానున్న తన భర్తనుకాంచి, యాతనికి సహాయపడవలెనని హృదయమునఁ దలఁచుకొని భర్తను సమీపించెను. ఇంతలో నొడలెల్లను రక్త వరదలై పీనుతుఁడొచున్న సింహబలుఁడు యువనిని వరిగె. అంతటాబళ్ళ తోవారలెల్లరును తమలోదాము చచ్చినాడురా నాకొడుకు చచ్చినాడని తమసంతసముం దెలుపుచు గంతులువేయసాగిరి. ఆ పలుకులు హేమావతి హృదయమున నాటినతోడనే దుఃఖము భయమయనెడి సాగరమున కొట్టు కొనిపోయెను. హేల పిచ్చిదానిచందంబున గంతులువేయఁ జొచ్చెను. ఇంతలో నిరువురు బందిగాండ్రు హేమావతిని సమీపించి „రావమ్మా! మా సేనానాయకుఁడు రమ్మనుచున్నాడని యంచిరి” „ఛీ! యెవఁడురా మీ సేనానాయకుఁడుకి మీరును వాఁడును యువతులకుఁ బొండనెను”. అంతటా బందిగాండ్రామెను యెక్కడకు పోయెదవని హస్తమును గట్టిగ పిడికిటఁ బట్టి లాగిరి. అంతటామె „ఎవడవురా చేయిపట్టుకొనిలాగెదవని మొలలో నున్న వెండిపొన్నుకైజారును తీసికొని హేలా! గుణరత్నావళిని జాగ్రత్తగా జూడుమని పలికి గుబాలున తనహస్తమును లంఘించిన చోరుని కైజారుచే పొడిచి చంపి, ద్వితీయుఁడు కత్తి నఱకుటకై వచ్చులోపల కైజారుతో దానుఁ బొడిచికొని నేలగూలెను.

అహా! ఏమి గుణరత్నావళి యవస్థ. ఎనిమిదేండ్లైనను నిండక ముందే లోకజ్ఞానము బాగుగరాకముందే, జననీజనకులు నేలపాలగుటయుఁ దాను దొంగలపాలగుటయుఁ సంభవించె. అహా! ఎవరివిధి యెవ్వరు త ప్పింపగలరు. ఎవరికెట్లు చతురాననుఁడు నుదుట లిఖించెనో తెలిసికొన నేరికశక్యము.

## గుణరత్నావళి.

### తృతీయప్రకరణము.

ఈబందెదండున కధిపతి కొండనాగులు. కొండనాగులు జాతికే నాదివాఁడు పసితనముననే సాహసుఁడై, విలువిద్యయందు ప్రవీణుఁడై, తనకులములో వేట యందగ్రగణ్యుఁడనిపించుకొని యిరువదివత్సరములు వచ్చినతరువాత యౌవనపుగర్వముచేత మిక్కిలున్మత్తుఁడై తనవలెనే మొండితనమునందును, శౌర్యమునందును, బేరుపడిన నేస్తకాండ్రఁ గొంద ఱిని జేర్చికొని సంపతునగరము మొదలు గుంటూరువఱకును గలదేశము లందుఁగల దారులఁ గొట్టుచు, బందెపోటుదొంగతనములంజేయుచు తన పేరువిన్నమాత్రమున ప్రజలందరును గడగడవడంకునటులఁ జేసెను. ఇందు చేతనే యాకాలమున బాట సాగించువారు బ్రహ్మాస్తమయమగుసరికే దిదొ యొకపల్లియఁజేరి, యారేయిచట విశ్రమించి, అహస్కరోదయ మయినతోడనే ప్రయాణము సాగించుచుండిరి. తత్కారణముననే హేమా వతి తన ప్రియవల్లభునితో భాస్కరాస్తమయమైనదనియు మార్గము సాగింపవలదనియు నుడివెను.

కాని సింహబలుఁడతిబలపరాక్రమవంతుఁడగుటచేతను యుత్తమ క్షత్రియకులసంజాతుఁడగుటచేతను, వెంటఁ నధికజనులుంటచేతను, భయ మన నట్టిదో స్వప్నమందైన నెఱుఁగనివాఁడగుటచేతను, భయమని నుడివి నను వెనుదీయక ప్రయాణమయ్యెను. కాని వారి దురాదృష్టముచేతనో మఱెందువలననో యానాఁడు కొండమిటిగి పైబడ్డట్లువచ్చి పత్రిఫలపుష్ప యుతావనిజాళిని నొకపెట్టున నేలగూల్చినట్లు పందువంటి సింహబలుని

సంసారమును క్షణములో నాశనముఁజేసెను. అకటా! పండువంటి సంసార మెంతలో కూలిపోయెను? ఏవస్తువునైనను బాగుపఱచి వృద్ధిలోనికిఁ దెచ్చుట దుస్తరముకాని చెడఁగొట్టుటెంతసులభము. గొప్పయు వలమును ధరణినుండి యహార్యముమీఁదికిఁ గొంపోవుట యసాధ్యముకాని శిలోచ్చయముమీఁదినుండి యురువైన ప్రస్తరమును క్షోణికిం బొర్లించుట సుసాధ్యముకదా? క్రూరులై, మూర్ఖులై, కఠినహృదయులై, దయయనెడి మాట నెచ్చట కాగడావేసి వెదకినను కానరాని యీతుచ్ఛులు పండువంటి సంసారముఁ నొక్కక్షణములో కూల్చివేసిరే. గుణరత్నావళి భయకంపితయై „అమ్మా!” యనియఱచుచు హేలకంఠమునుఁ గట్టిగాఁబట్టుకొనెను తనయజమానునియొక్కయు, యజమానురాలియొక్కయు దారుణమరణంబులఁ గన్నులారఁగాంచి „అమ్మా!” యని వెక్కివెక్కి యేడ్చుచున్న యాబాలికను చూచుచు నేమియుఁ దోఁచక గడగడ వడంకుచు హేల నిలువఁబడియుండ, చుట్టును దయలేక నల్లనికారెనుబోతుల చందంబున నిల్చియున్న యాచోరులలో నిర్వురు ముందుకువచ్చినిల్చి „మాదంపు నాయకుఁడు పిలుచుచున్నాఁడురా” అని కేకవేసిరి. అంతట హేల మారుమాటాడక యనేక దైవములకు ననేక దేవతలకు ననేక తెన్నులవారల నావిపత్తునుండి రక్షింపవలయునని ప్రార్థించుచు వారివెంట నంటెను. ఆతోహరద్వయమాబాలికతోఁగూడ హేలను రమారమి యొకపరుగుదూరమున మద్యపానముఁజేసి మత్తెక్కి నోటికివచ్చిన పేలాపనములఁ బ్రేలుకొనుచున్న వారివద్దకుఁ గొంపోయెను. ఆనిప్పులవంటి నేత్రములు, ఆఘోరబుఱ్ఱమీసము, బిఱుసుగడ్డము, ఆగద్గదస్వరము, ఆపేలాపనములు, ఆకుల్లు, ఆభీకరవిగ్రహము నొక్కసారి గన్నవారు యెంతధైర్యవంతులైనను భీతిఁజెందకపోరు. అందు యజమానుని యజమానురాలిని గోలుపోయిన యాహేలగుండియలెట్లుండునో చదువరులాలోచింతురుగాక.

ఏమిచేయుదురోయని చలిజ్వరము సోకినదానివలె వడఁకుచు నిలుచఁబడిన హేలను యిరువురు దొంగలు సమీపించి “ఓసీ! నీవద్దనున్నసొత్తు నక్కడ నుంపుము. లేకున్న నీయొడలు దివిటీలచే బ్రేల్చెదమని” బెదరించిరి. అంతట హేల “నాయనలారా! నాయొద్దధనము లేశమైనను లేదు. జననీజనకులఁ గోలుపోయినపిల్లయు, యజమానుని, యజమానురాలిని గోలుపోయిననేనును మీయధీనమైతిమి. ఈచందనగంధికంఠమునఁ గలకంఠెయు, హస్తములనున్న మురిడీగొలుసులు మురుగులును, దక్కనన్యమేమియు లేవు. మిగిలిన సొత్తెల్లను పెట్టెయందున్నది. అది మీయధీనంబు. ఇంతకంటె నావద్ద నేమియు లేదని దుఃఖము నాపుకొనలేక వెక్కివెక్కియేడ్చి నాయనా! “కాల్పించినను పేల్పించినను నాయొద్ద నింతకంటె నైన కాసైనను లేదని గద్గదస్వరముతో సరచెను.” గుణరత్నావళియు బిగ్గరగా “అమ్మా! నాయనా! యని యఱచి యశ్రువులఁ గార్చుచుండెను. సుఖాసుఖములు దైవయత్నంబులు. దైవయత్నములేమి, నరయత్నములు చేకూరవు. అనేకస్త్రీహత్యలు నరహత్యలు మున్నగుహత్యలఁ సల్పి, యనేకపల్లియల వైశ్వానరుని పాలిటజేసి కనికరమన్న నెట్టిదో యెరుఁగని హృదయములు, కొండరాళ్ళకంటెను కఠినములైన హృదయములా వారియు గుణరత్నావళిదుఃఖముఁ జూచినతోడనే కొంచెము మెత్తపడెను. అదియే వారిహృదయములాదిగా మెత్తపడిన దినము. ఆనాఁడే నల్లరాళ్ళ లక్షణము తొలగిపోయి మానవలక్షణము మొలకెత్తినది. కొంతదవ్వు నాగులు హేలయొక్కయు, గుణరత్నావళియొక్కయు, ముఖారవిందమును పారజూచి “ఓయమ్మా! నీకు పిల్లకువచ్చిన భయములేదు. నీవెక్కడకుఁ వెళ్ళవద్దు. మాతోడ నేదోయింత కలిదో యంబలియో త్రాగి కొండలలో మావద్దనేయుండుము. మీకేసువురకును కూడు గుడ్డ యిచ్చి పెంచెద. నామాటలకుఁ దిరస్కరింపవలదని చెప్పి, సేవకులఁ బిలచి యార్గో జోగులు

యోరో జోగులు, బంగ్లకట్టుడు: వీరలను బండిమీఁదనెక్కించి మనగూడెమునకుఁ దీసుకొనిరండని యాజ్ఞాపించెను. ఇంతకు మన కుమారిత్నావళి పుట్టిన దినము మంచిది. తల్లిగర్భము చలువైనది. అట్లుకానిచో నల్లరాళ్లకంటె కఠినములైన వారలహృదయములెట్లు కఱఁగుట తటస్థించును? ఇంతకును దైవముకూడా వారిపాలిటనేయున్నాఁడు. లేకున్న యాక్రూరులువారలను చంపవలసినదేకదా?

## చతుర్థప్రకరణము.

మానవుఁడు చింతాకులస్వాంతుఁడగునప్పుడు నిముసములు గడియలై, గడియలు జాములై, జాములు దినములై, దినములు మాసములై, మాసములు వత్సరములై, వత్సరములు శతాబ్దములై, శతాబ్దములు యుగములై తోఁచును.

అహాహా! జన్మస్థానము విడనాడి మిక్కుటమగు దినములుగడచె; ఆలుబిడ్డలను, యనుజులను, యాప్తబంధుమిత్రులను, విడనాడినాఁడ. హా దైవమా! యీఘోరారణ్యమున నాకు దిక్కెవ్వరు. తోడెవ్వరు. నీడెవ్వరు. భార్యాపుత్రులను యాప్తబంధుమిత్రులను విడనాడుటయెంతదుస్తరమో, స్వదేశమును అందు జన్మస్థానమును విడనాఁడుటయు నంత దుష్కరమే కదా! గృహమున దారాపుత్రులెట్లున్నారో. ఎటువంటి కాలమును వెళ్లబుచ్చుచున్నారో, తెలియనైన సంజెప్పెడరెవ్వరాయెను. యీఘోరారణ్యమున నాకు దిక్కెవ్వరు. ఓతరువులారా! ఓపికములారా! ఓశుకములారా!

ఓ మయూరములారా! ఓ హంసములారా! నావంటి దిక్కుమాలిన వానికి మీరైనను దిక్కుపడరాదా?

అహా! పంచపురుషాంతములనుండి మావంశమునకుఁ గాపురమై నాకుఁ జన్మస్థానమై, సకలసంపదలకుఁ నాకరమై, పుణ్యస్థానములలోను ముక్తిప్రదాయకములగు నగరములలోను నొకటియై రంజిల్లు వారణాశీ మహానగరము నేనికఁ నెన్నఁడైనను గన్నులపండువుగ జూడగాంతునే! వసంతమున సాయంసమయములందు శ్రీభగీరథీతీరంబునకుంజని సుందర మందగమనములోఁ నడయాడుచుండు మల్లికములను, మేచకముల నిప్పి మలయమారుతమందు సంతోషదాయకముగాఁ విసనాడు శిఖావలము లను ద్వివిధగమనములోఁ నటునిటునడయాడుచుండు వాతాయువులను గాంచుచు సంతసించుచు యాపుణ్యనదీ జలోపరిభాగమునుండి వీచుమంద మందమలయానిలయంబులు నెమ్మేనుసోక నెన్నఁడైనను సౌఖ్యమనుభ వింతునే. సూర్యవంశవృత్తాంతమును, రామజననమును, సీతాకళ్యాణ మును, దశరథాజ్ఞయు, రామవనవాసమును, ధశకంఠుడు జానకిని లంకకు గొంపోవుటయు, వానరులనేస్తమును, వాలిమర్దనంబును, లంకాదహ నంబును, సేతులంఘనంబును, దశకంఠవధయును, విభీషణ పట్టాభిషేకం బును మున్నగు రామాయణగోష్ఠంతయును, చిత్రికతలును, గొప్ప వీరు లచారిత్రములను సర్వసామాన్యముగాఁ బల్లియలనుండి మధ్యహ్నమునకు వేంచేయు బంధుగులకు నెన్నఁడైన వీనులవిందుగ వినుపింతునో ప్రదోష కాలంబున నాలయంబునకుంజని సకలజనారాధనీయుండగు కాశివిశ్వేశ్వరుని నాచేతులారఁ బూజించి ప్రార్థించు పుణ్యము నాకిక నెన్నఁడైన నబ్బునో హా! నావంటి యదృష్టహీనునికేనా యింతటిభాగ్యము. నేనెక్కడ కాశీపు టంబెక్కడ. [illegible] నాకిదిమనువలయు. సమస్తసౌఖ్యములఁ విడనాడి

దిక్కుమాలినవాఁడనై కానిదేశముల వెరియుంచుచు దోవకానక యరణ్య
ములంబడి సంచరించుమని యాచతురాననుఁడు నుదుట మాతువంక్తుల
లిఖించియుండ సౌఖ్యంబెట్లబ్బు? ఓకాశీవిశ్వేశ్వరా! నాచేసిన దోసంబెద్ది?
నీపాదారవిందధ్యానమాచరింపక మఱచి నిదురవోతినా? ఏయతిథికైన భ
క్తంబీయక నంపినాడనా? కటకటా! ఎన్నఁడును యేరికైన నొకయెగ్గుఁ
జేసి యెరుఁగనే. భవతాపకంబులగు నీయడుఁగు దామరల నొకసారియై
నను ధ్యానింపని ఖలులను నమృతముకంటె నెక్కుడు మధురమగు నీనా
మంబెన్నఁడును స్మరింపని పాపులను శిక్షించిన న్యాయంబై బరఁగు. ఏమి
యునెరుఁగని నన్నీఘోరారణ్యంబను మహాసాగరమున ముంచితివే? హా!
ఏమి? అయ్యయ్యో! నిష్కారణముగాఁ గర్మసాక్షియగు భగవంతుని దూర
నేల? విశ్వమోహనంబగు దేముని సుందరవిగ్రహంబు మఱవునైనంగనుఁ
గొనని యధములును, వైదికమార్గప్రవర్తకులును, గోబ్రాహ్మణవధ
పాతకులును, కన్యావిక్రయులును; యీర్ష్యాళువులునైన బ్రాహ్మణులం
దరును రొకటియై, అంగవంగాది దేశములకుఁ గొప్పరాజైన బుక్కరా
యనితోడ నాపయిం లేనిపోని కొండెములఁ గల్పించి నిందమోపి రాజ
సభనుండి తప్పించిరి. అహా! "దృష్టంత్వపఁచక్రిబం" అను నీద్వివిధయము
లకును వడంకవలసివచ్చెఁగద. న్యాయవిచక్షణుండైన యాబుక్కరాయని
తోడ నాపయి నేరములఁ గల్పించి చెప్ప, యందింపకయు తత్త్వార్థము
గ్రహింపక వారిపలుకులపై నన్నుఁ దరిమివేసె. అహా! నలువురిచేతను
న్యాయవిచక్షణుఁడని పొగడొందిన నీని న్యాయంబెబ్బుగ్గిలోఁ గలసె!
ఏమి? కాలమహిమ "పుణ్యమునకుఁ బోయిన పాపమెదురుగ వచ్చె"
నన్నట్లు వాస్తవంబుగా నాయీయనుభవంబునఁ దేటయయ్యె. నావలె,
బుక్కరాయఁడెన్నఁడేని కర్ణకటుమఁ వినునాఁడే నావలె మనస్తాపంబు
నొందకుండునే? నావలెఁ నాపకదుర్భాగ్యులను, పీడుఁపు, వరుల వలుకు

[illegible]ందు విశ్వాసముంచి న్యాయవిచక్షణలులేక వారివైరులపై [illegible] శిక్షించు నీచార్వాచీనుల, తనదారాపుత్రుల తనుజుల మిత్రవర్గములఁ బాసి దేశాంతరమై నావలెఁ నిట్టిఘోరమృగాకులమైన మాయారణ్యములఁ జరియింపఁగలిగి సంభవించకుండునే? మఱియు నగ్రజన్ములనొక్క నిమిషమైన నన్యాయముగాఁ బీడించినవారనుభవించు చిత్తక్షోభ నూరుమడుంగులై యుండు. అందు నేనగ్రజన్మమునఁ జనించినాడ. నిర్దోషిని. కావున నాపాలిటి యముడు వానికిని, వానికుటుంబమునకును, నెన్నఁడైనను తగులకుండునే? అవును. పాడియుఁ బంటయుఁ సిరియుఁ సంతతియుఁ గలిగి పండువలె నున్న నాసంసారమును గూలఁద్రోసిన యీరాజాధముని దైవంబీదుముల సాగరంబున ముంచకుండునే? నాకీభూస్థలిఁ బ్రాణమున్నంతవఱకు నేనాతనితోడను, బ్రాహ్మణులతోడను, పగసాధించి నాయావచ్ఛక్తి వినియోగించి సామదానభేదదండాద్యుపాయ చతుష్టయములలో నెద్దాని చేతనైనను వాని నెల్లనను రాజభ్రష్టునిఁ గావించి, బ్రాహ్మణుల శిక్షించకున్న యేను బ్రాహ్మణుఁడగాను. ఇదియే నాశపథము. నేనెవ్వఁడను? శత్రుసంహారుఁడను. సరియె. ఇప్పుడిదిట్లుండనిమ్ము. ఇప్పుడు నేనేదేశమునకుఁ బోయివసింతును? ఏదేశమున నన్నెవ్వరెరుంగుదురు? అందు క్రొత్తవానిని యెవ్వరాదరింతురు? ఏవిషయంబులకుఁ బోవఁ దోచకున్నది. కానిమ్ము. నేటినిశి హేమనగరంబునకుఁ జనియెద. అది సిరులకును ధర్మములకును పుట్టినిల్లని విందు. కావున యానగరమునకేగి శిరంబు దాచుకొనిన బాగుండునని తోచుచున్నయది. అదిగో! ప్రొద్దు గ్రుంకుచున్నది. ఇంతకుదూరముననే యొకపల్లియ గానవచ్చుచున్నయది. పెందలకడనే యాపల్లియఁ జేరుకొందు. భానుఁడు పశ్చిమమున సిందూరతిలకము నందము వహించుచున్నవాఁడు. అని తనలో వితర్కించుకొనుచుఁ నొకవిప్రోత్తముఁడు [illegible] నాటి సంధ్యాకాలమున కృష్ణవేణినొక్క

పార్శ్వమునన్న యడవిలోనుండి ముందరిపల్లియకుఁ జేరుటకు [illegible] లేవ లయునని త్వరితగతి బోవుచుండెను. అతఁడు [illegible] పెద్దని దబ్బవంటిముఖముగలవాఁడు. శ్వేతవర్ణులవాఁడు. [illegible]వాఁడు. పొడగరి. స్థూలకాయి. పిక్కబలమువాఁడు. కంఠమునందు రుద్రాక్షలఁ ధరించినవాఁడు. వీపుపై [illegible] గలవాఁడు మోమున జటలముఁ గలవాఁడు. అరుణోదయమునుండియు నన్నపానీయాదులు లేక చమటలు కారుచుండుటచేతను రవిప్రొద్దని గ్రుంకకముందే ముందటిపల్లియఁ జేరవలయునని యెంచి యతిరయమున వడివడి నడవఁదొడంగె. కాని ప్రొద్దు గ్రుంకకముందా పల్లియఁ జేరలేకపోయెను. ధ్వాంతమవియుడియుంగన తల [illegible] గాననందరుబుక క్రమ్ముకొనెను. ఆహారార్థము కంఠీరవములును, వ్యాఘ్రములును, శార్దూలములును, తమతమ గుహల వెడలెను. కల్య [illegible] తమతమఘోషములం దెల్పుచు తదితరమృగములు దరిఁజేరకుండ [illegible]లనిచ్చి నృత్యముఁ జేయుచుండె. సకలభయంకరమైన యాఘోరారణ్యమున నట్టి నిశాసమయమునఁ జేయు నంతటి గుండెగలవాఁడైనను [illegible] భీతి కలుగక మానదు. ఆచీకటియందు కీచకీచధ్వనులగ్గడలను వినఁబడుచుండెను. శృగాలముల బొబ్బలును వానికిఁ దోడయ్యె. అట్టి భయంకరముగా రేయి సహజముగ ధైర్యశాలియైన యాతనిగుండె జంకఁ బ్రారంభించెను. క్రమముగాఁ నాయరణ్యమునందలి ఘోరమృగములును, భూతపిశాచములును, తనయెదుటఁ బొడగట్టుచుండెను. మిక్కుటముగ ప్రొద్దుపోయె. కృష్ణాదేవి శిరముపై బ్రకాశించె. కాని యాచంద్రదేవత లక్ష్యముఁ జేయక భయకంపితుఁడై, వెనుకముందుఁ దిరిగిచూచుచు హరిస్మరణంబొనర్చుచు తనమార్గమున నడచుచుండె.

[illegible]

నగు యొక్క కిరాతుఁడు వాని వెనువెంటవచ్చి, వానిమూర్ధమునం నేలఁ
గూల నొకబడితతో నొక వేటుఁవేసె. అంతటాతఁడు పరశువు వేట్మునం
ధరఁగూలిన నొక్కతరువుఁబోలె గిజగిజ తన్నుకొనుచు శిథిలింగూలె.

## పంచమప్రకరణము.

వినుకొండ, యిది గుంటూరుపరగణాలోనిది. ఇదిచారిత్రము
లలోఁ బ్రఖ్యాతిపడసినట్టియు, గొప్పనృపాలురచే బరిపాలింపఁబడినట్టియు
నగరములలో నొకటి. ఇందొక గొప్పగిరి కలదు. తొల్లిదశకంఠుఁడు జాన
కిని లంకకుఁ గొంపోవునపుడు జటాయువను పక్షి శ్రేష్ఠము నాయచల
ముపై వానినెదుర్కొనెను. అప్పుడు వారిరువురకును దారుణమగు
రణంబు వాటిల్లె. అందు జటాయువు తన మాతను గొంపోవుచున్న నీచుఁ
డును, పరనారి లోలుఁడును, దానవేశ్వరుఁడును నగు యాదుర్మార్గుని,
శిరోభూషణమును క్షోణింగూలఁ దన్నెను. తన తనూరుహములచేతను,
పొడవై, వాఁడియై బలాఢ్యమైన త్రోటితోడను పదనుగల కాలివ్రేళ్ల
తోడను, కొట్టియు, పొడిచియుఁ, జీల్చియు వాని ననేకతెన్నుల బాధిం
చె. కాని యతి బలపరాక్రమశాలియు, దుర్మార్గుఁడును అనగా దనుజా
ధిపతి తన శరమున నాపక్షిపత్రములఁ ఛేదించి తన ద్వీపంబున కరిగె.
నేటి దివసము వఱకును వారియువురకును వాటిల్లిన రణభూమియు పాదాం
జలి చిహ్నములును, నక్కడక్కడ వసుమతిలోనికిఁ బాతుకొని పోయిన
యస్త్రములును కలవు. రణంబు వాటిల్లిన యల్పదినములకు శ్రీరాముఁ
డును లక్ష్మణుఁడును జానకిని వెదకుచుఁ దమమార్గమును ధరయులపై నుం

చేగుట తటస్థమయ్యెను. అంతట సర్వసద్గుణాలంకారయుఁ నిర్మల విజ్ఞాన విశారదయు, స్వామిభక్తి తత్పరయు నగు జటాయువు తన పరిసరము నుండి యేగుచున్న శ్రీరామ లక్ష్మణులంగాంచి పిలిచి జరిగిన కథనెల్ల తెల్లంబుగా వినిపించి కాలధర్మమునొందె. శ్రీరాముఁడు జటాయువుచే నాయచలముపై జనకజపుత్రిని దానవేశ్వరుఁడు గొంపోయెనని వినుటం జేసి యాకొండకు "విన్నకొండ" నియు, నిగమమున్కుఁగూడ "విన్నకొండ" నియు నామధేయంబుకలిగె. కాని కాలక్రమమున నదే హేతువుచేతనో "విన్నకొండ"యనునామముమారి "వినుకొండ" యనివ్యవహరింపఁబడుచు వచ్చెను. అయినను "విన్నకొండ" "వినుకొండ" నీద్విపదములకును సంతగా తారతమ్యములేదు. కాని యీపుత్తనముపేరు మాత్రము "విన్నకొండ" యనినొక్కిచెప్పుచున్నాను. ఆగోత్రముపై నున్న భగవానుఁడు రామలింగేశ్వరుఁడు ఈలింగమున్ను శ్రీరాముఁడు ప్రతిష్ఠించె. దానినంటియే భరత గుండమును దానికనతిదూరమున సీతారామగుండములును కలవు. రామ గుండమునకుఁ బ్రతిదిని పై దేహి వామనగుంటలాడి బోరగించిన యుపలమును, తొల్లివసిష్ఠవామదేవాదులచేఁ జేయఁబడిన హోమగుండములును, శేషశయ్యయు, గోగర్భంబును కలవు. గోగర్భంబునకు వామన భాగమున కాళిఘట్టమునకుఁ బోవు సొరంగమార్గమును కలదు. ఇంకను యీపర్వతమును గుఱించిన కతలనేకంబులు గలవు. కాని వానినంతగా నిక్కడుదహరించుట యనావసరంబని యుదహరింపలేదు. మఱియు, కాళిఘట్టసొరంగంబును గూర్చి యెంతవఱకు వాస్తవమో తెల్లంబుకాదుకాని, దీనిని గూర్చిన కతలనేకములు కలవు. నేఁటిదినంతవఱకొక సొరంగము మాత్రము కలదు. ప్రస్తుతము విన్నకొండనగరము కొండదిగువనే యున్నను, తొల్లి కనకదుర్గసామ్రాజ్యమున్న కాలమున నగరము కొండపై నుండెను. ఇప్పటికిని చిరకాలమునుండియు కట్టబడిన ప్రాకారసంబంధమైన

నేగరు. ఇందులకు ముఖ్యహేతువు వచ్చినవారలకుచిత మర్యాదలఁజేసి సృచికరముగా భోజనమిడుటయే.

ఆదెమ్మ పుట్టినిల్లు గొట్టిపాడుగ్రామము. ఆకు బాలాతూపవతి. కాని యాబిడ్డ జననీజనకులు ధనములేమి విన్నకొండపరిసరముననేయున్న పెరుమాళ్ళపల్లె నివాసుఁడగు యజ్ఞోపవీతపు పేరయ్యశాస్త్రిగారివద్దనుండి కొంతమూలధనముఁ గ్రహించి, వానికిచ్చి వివాహముఁ గావించె. ఆతఁడు పదహారవవన్నెపయిడివంటిచాయవాఁడు. ఎనుబది వత్సరముల ముద్దుబాలుఁడు. పాపమీపిల్ల కర్మమేమోగాని వివాహమైన పదహారవ దినవు పండువయైనను దాటకుండ భర్త కాలధర్మము నొందెను. ఆహా! పంచవర్షప్రాయముననే పెండ్లిఁ జేయుటయు, భర్త మృతినొందుటయుఁ దటస్థించె. పాపమాబాలిక చిత్తక్షోభ యేమని నుడువవచ్చును. దానిని వర్ణింపనేరితరముః ధనమునకాశించి, ధనమే ప్రధానముగాఁగైకొని, కుమరికకుఁ ముందురాబోవు నిడుమలను మరచి యట్టిముదుసలితోఁక్కనకిచ్చి వివాహము గావించిన మాతాపితలు కాలులుగాని మాతాపితలాః ఆపె దుఃఖసాగరమునకంతటికిని వారే ముఖ్యకారకులుకదాః మఱియుఁ నాగమ్మ జననీజనకులది శుద్ధవైదికకుటుంబమవుటంజేసి భర్త మృతినొందిన పిల్లకు కేశములుంచిన బందుగులధిక్షేపింతురను భయమున, వారామెకు షోడశప్రాయముననే కేశఖండనముఁ జేయఁదలపెట్ట యామె యిరుగు పొరుగుననేయున్న యిరువదేండ్లప్రాయముఁగల నొకచిన్నవానినిఁ దీసికొని స్వగ్రామమును విడిచి విన్నకొండకేగి యచ్చట తురుమెళ్ళవారిగృహము నొకదానిని బాడిగకుందీసుకొని యుదరపోషణార్థమై పూఁటకూండ్లంబెట్ట నారంభించె. త్వరితకాలములోనే యామెపేరు పశ్చిమమున దొనకొండ, గజ్జలకొండ, మార్కాపురము, కంభము, కర్నూలు, బళ్లారి మఱకును,

తూర్పున ఖావల్యాపురము, నర్సారావుపేట, సాతులూరు, గుంటూరు, మంగళగిరి, బెజవాడ ప్రాంతములవఱకును వెల్లడియై ప్రసిద్ధికెక్కినదా యెను. ఆమె చేసెడిది నీచవృత్తియైనను ప్రజలందరు నామెను నిరతాన్న దాతురాలనియు, గృహము నిరతాన్ననిలయమనియు ననెడివారు.

ప్రథమప్రకరణములో నుడివిన వత్సరమునకు, ననగా 1679 వ సంవత్సరమున నాశ్వయుజశుద్ధ తదియాభట్టారకవాసరంబున రంగరాజను నతఁడు గుంటూరుపరగణా సాతనపల్లితాలూకాలో చేరిన క్షీరసాగరమను నొకపల్లియందున్న తనమాతులుఁడగు గజపతిరాజున కొడల స్వస్థతగా నుండుటంజేసి యాతనిని దర్శించుటకై సువర్ణనగరమునుండి బయలు వెడలి, మార్గమున ప్రస్తుతమప్పుడు వినుకొండను పరిపాలించుచున్న సార్వభౌముండగు నారాయణామాత్యుఁడాతనికి బాల్యనేస్తకాడగుటంజేసి వానిని దర్శింపఁ గుతూహలాయత్తచిత్తుండై నాటిదినమున నక్కడవిడసి రాజదర్శనముంజేసె. నారాయణామాత్యుఁడు రంగరాజును వెంటఁబెట్టు కొని వరణములను, యందుగల శృంగారశిల్పిపనులంజూపి తదనంతరమా కోటకు వాయవ్యమూలగానున్న యారామములోనికిం గొంపోయి యుద్యానవనమునంతను చూపించి, నానావిధములగు పుష్పములను ఫల ములను గోసియిచ్చి నాటికాతనిని తనగృహమునకు విందున కరుదెంచ వలయునని కోరెను. కాని యతఁడు లజ్జాకరుఁడై యందులకియ్యకొనక „ఎందుకులెండి. ఎన్నిపర్యాయములు వచ్చుచు నేగుచుందుము. ఈప ర్యాయము వచ్చినప్పుడు తప్పక మీగృహమునకే వచ్చి విడిసెద. ఈదిన మునకు నన్ను విడనాడ బ్రార్థింపుచున్నవాడను. నాగమ్మగారు నా నిమి త్తమై వేచియుండుట తీరామరచి యామెను వంట చాయవలయునని యను జ్ఞ నిచ్చినాఁడ." నని నుడువ యాతఁడు „సరియేలెండి. జ్ఞాపకముంచుకొ

నుఁడు. ఈపర్యాయిమెప్పుడైనను మీయూరు వచ్చుట తటస్థించెనేని మీయాగ్రహమున విడిచెదనేమో చూడుఁడ" ని మొగమోటపు మాటలం బల్కి యాతనిని వీడుకొల్పె.

## షష్ఠప్రకరణము.

తదనంతరము రంగరాజు నారాయణామాత్యుని వద్దనుండి వచ్చిన తోడనే తన తలపాగాను తీసి పడమటి యింటియందున్న చిలుకకొయ్యకుఁ దగిల్చి, చొక్కాయ మున్నగు వస్త్రములం దీసి యొకబల్లపై నుంచి యంగవస్త్రముఁ దాల్చి స్నాతుండై, నైరుతిమూలగానున్న మహానసమునందు తన్నిమిత్తార్థమై వడ్డించియున్న తావున కేగి పీటపై నధిష్ఠించె. రంగరాజున కొకభాగమున నాగమ్మయు నొక చౌకలిపీటను వైచుకొని కూర్చుండెను. నాగమ్మ పూఁటకూళ్ళను పెట్టుట కారంభించిన దాదిగా నాదాయురాలగుటం జేసియు, కొల్లగా లక్ష్మినిచే నీయుటం జేసియు, తాను శాకాదుల పచనముఁ జేయుట చాలించి యిరువుర వంటలక్కలను, యిరువుర వంటబ్రాహ్మణులను నేర్పరిచెను. తాను మాత్రము పైగానుండి వారలచే రంగరాజువంటి ఘనులేరైన నరుదెంచి నప్పుడు తన చౌకలిపీటను వంటఁజేయువారి పరిసరముననే వైచుకొని, కూర్చుండి వారలపేక్షించు నట్టికాని, లేక వారలకుఁ బ్రీతికరములైనట్టికాని శాకపాకాదులను పిండివంటలను చేయించి, వారల కది యీరీతిని చేయవలెను. వీరల కిది యీతెన్నున చేయవలెనని చెప్పెడిది.

రంగరాజున కానాఁడు గల మాన్నంబులును, వంటకంబులుఁ బొగలిపులిహోరంబు, మిరియంపుఁబొడి, మెంతికూటువ వసంబారంబుఁ జింత

పంషులు, సిరికలు, బచ్చెఖ్లూరు బిండ్లూరుఁగాయలు, ధధ్యోజనంబు, జు
న్నులు మీగడ పెరుగులు, నవనీతంపు ఘుటికలు, నోలుప్పుఁ బప్పుప్పొ
డంబులు, వఱుగులు, వడియంబులుఁ బెరుగు వడియంబులు నివి మున్ను
గాఁగల పరికరంబులును, మఱియు వడపప్పు బేడలు, వేపుఁడులు, బొరు
గులు, బొదులుఁ బాకపుఁజలిమిడి కాయమ్మలుం, జిమ్మిటుంటులు, మూ
గలుఁ లాజలుఁ బేలాలు, జటికాఱుకులు, సారపప్పు, జీడిపప్పు, బాదంగి ప
లుకులు, ఖర్జూరములు, దాక్షలాదియైన ఫలహారంబులును, దోసెలు,
పీసెలు, గొట్టెలు, లిప్పట్లపంబు లతిరసంబులు సుకియలమృతకలశమ్మలు
సోగులుఁ జక్కెరబుడగలుఁ గరిజలుఁ బొరివిళంగాయలుఁ దేమనంబును
బొలకాయలుఁ గారపుగారెలు మున్నగు భక్ష్యంబులం జేయించె.

హోమకుంచమునఁ వడ్డించిన యాపరికరాదులంజూచి రంగరాజు
విపరీతచేతస్కుండాయె. రంగరాజు వాటినెల్లఁ దినజాలక, తన కతిప్రీతిక
రములగు వాటినెల్ల లేశముగా గలుపుకొని భుజించుచుండెను. అంతట
నాగమ్మ రంగరాజు నెట్లయినను బలుకరింపవలెనన్న వాంఛ డెందమునఁ
గలదై యిట్లనియె.

నాగ:—“అయ్యా! రంగరాజుగారూ! మీరు గొప్పవంశమునం
దుఁ జనించినవారు. అందు రాజులుకదా? మీస్వగృహమున నున్నంత
సుచిగా మాపరికరములు, ఫలహారములు, పిండివంటలు, భోజనమును యుం
డదు. ఎన్నఁడును పూఁటకూళ్ళయింట భుజించి యెఱుఁగరు. మావంటల
యందు లోపాలోపములున్న క్షమింతురుగాక. ఏబాగుననో నేఁటిదవసము
నకుఁ గష్టపడి భుజింపుడనెను.”

రంగ:—“సరేలెండి. ఇంతసుచికరములగు పదార్థములను మా
స్వగృహమునందైనను చేసికొనము. రాజులన్న నామమే గాని యిన్ని ప
రికరముల ఫలహారముల నిత్యమును జేసుకొందుమని తలఁపకుడు.

ఇక్కడికే యివి వెక్కసమైనవి. మఱియు నేటిదినమున మీవంటి బ్రాహ్మణులయింట భుజించుటవలన నాకోర్కెలీడేరె. ఏలనంటిరేని నాకనేక దినములనుండి బ్రాహ్మణుల గృహమున భుజింపవలెనన్న యొక్క వాంఛ కలదు. ఎంతటిమాట శెలవిచ్చినారూ? అని రంగరాజు ప్రత్యుత్తర మిచ్చెను."

నాగ:—„దానికేమిలెండి. ఏలాగునైనను బీదభోజనము బీదభోజనమే. అయితే తమస్వస్థలమే యూరు?"

రంగ:—„అమ్మా! మాస్వగ్రామము సువర్ణనగరము."

నాగ:—„ఆలాగునాండి. అయితే తమ గృహనామధేయము?"

రంగ:—„మాగృహనామధేయము రామరాజువారు."

నాగ:—„అయితే రామరాజు గజపతిరాజుగారు మీబంధువులేనా?"

రంగ:—„వారు మాజనకులే."

నాగ:—„ఓహో! ఆలాగునాండి! నేనింకా మీరెవరోయని తలంచుచున్నదాన. మీజనకుని యపారఖ్యాతి యేమని నుడువవచ్చును. అంతటి మహానుభావులెక్కడ నీకాలమునం గానరారు. అయితే మీతండ్రిగారింకను హైదరాబాదు నిజాముగారి వద్దనేయున్నారాండి?"

రంగ:—„ అవును. ఇంకా నక్కడనే దివానుగానున్నారు. అయితే మీకీపూటకూళ్ళవలన లాభమేమైన వచ్చుచున్నదా?

నాగ:—నాయనా! „ఇంతవఱకు, మీదయవల్లను మీజనకుని దయవల్లను ముఖ్యముగా నాభగవానుని కృపవలనను యేదోకొంత యాదాయము వచ్చుచున్నది. పది బస్తాల యొక్కయు నైదు గంగిగోవుల

యొక్కయు పాడి సమృద్ధిగానున్నదండి ఆయూరి కరణమోయేట, యీ యూరికరణమో యేట క్లోగా చెప్పను, పచ్చని నవనీతపు జొంపమ్ములను పంపుదురు. అందుచే పశువుల మేత కేమియు గొంతలేదు. మఱియు నేనీ వత్సరము రామేశ్వరపత్రికుఁ బోవలెనను తలఁపుకలదు. మీవంటిఘనులెవ్వరేని వత్తురేమో యేమైన ధనసహాయముఁ జేతురేమోయని యెదురుచూచుచున్నదాన. నేటికి నాకోర్కె లీడేరె."

రంగరాజు తనవెంట నొక మడేలును కూడా గొనివచ్చెను. వాని పేరు సంగన్న. వాని భోజనమునకు మిక్కుటముగు పొద్దుఁబోయె. అందుచే రంగరాజు నాగమ్మగారితో నిట్లనియె.

రంగ:—నాగమ్మగారూ! „నాభోజనము కావచ్చినవి. మాభృత్యుఁడగు సంగన్నకు భోజనము వేళ తప్పుచున్నయది. కావున వానికి త్వరితగతి భోజనము వడ్డింపుడనెను."

నాగ:—అయ్యా! „ఆలాగువనే వడ్డించెద. ఇదే తర్లుచున్నదాన."అని రంగరాజు కూర్చున్న స్థలమును విదలివెళ్ళెను. ఇంతలో రంగరాజు భోజనము పూర్తియయ్యెను.

చాకలి సంగన్న భోజనముచేసిన తదనంతరము రంగరాజు నాగమ్మను పిలచి „అమ్మా! నాగమ్మగారూ! మీకివ్వవలసిన పయికమెంత?" యని యడిగెను.

నాగ:—నాయనా „మీవంటివారిని యింత యివ్వవలయునని యనుఁగను. నీ రాకరుణాకటాక్షము. మాయదృష్టము. అయినను మీరు పారిపోయెదరా యేమి? మీధనం బెక్కడకుఁ బోవు?"

రంగ:—అంతట రంగరాజు అమ్మా! „ మేము పారిపోవుదుము;

మీకీవ్వమనికాదు. మేము వెంటవాత పయనమై వెళ్ళవలెను. అని చెప్పి తన నౌకాయజేబులోనుండి పండ్రెండు రూపాయిలను దీసి యామె హస్తమునందుంచె.

నాగ:—రంగరాజుగారూ! "అంతతొందరగా నేగుట కంతటి కృత్యమేమియున్నది.? నేటిదినమున కాగి రేపుపయనమై వెళ్ళవచ్చును."

రంగ:—నాగమ్మగారూ! "ఇంకొక్క గడియకాలమైనను నిలుచుటకు వీలులేదు. మాయమ్మగారు మా మామగారియొడలస్వస్థతగా నుండుటంజేసి, నేగనన్నకొలందిని నీవేగక తప్పదని బాధించి బలిమిం బంపిం డి." అనెను.

నాగ:—"అవునండి. మీకేమియెరుక వారిది ప్రేగు సంబంధము కావున యటుల బాధించుచుందురు. చూచినారా! మీరు వెళ్ళనన్నప్పటికిని యామె బలవంతముగా నెట్లు బంపినారో పెండ్లియై, భర్తతోం గాపురము జేయుచున్నను ప్రేగుబాధ యెట్లు తప్పును నాయనా! మఱియు నిట్టి సమయమునందు మీరాగుటయు నుచితముగాదు. నేనాగవలయునని యనుగుటయు మంచిదికాదు. మఱియు మీరెటుల నేగెదరో కాలముం జూడ కాసికాలము వచ్చి కూర్చున్నది. పగలే బందెగాండ్రభీతి మిక్కుటముగానున్నది. మీరెటుల నేగెదరో నాకుం దెలియకున్నది. అయినను నెవరి విధి నెవరు తప్పింపంగలరు. ఏకాలమున కేదికానున్నదో తెలియదు. కానిమీరాభగవంతునియందే భారమువై చుండు. మీరు తెల్లవారుజామున నేగెదమనుచున్నారు. మీరు నాకంటె పసిండిలేవంజాలరు. నేను మిమ్ములను నిద్రనుండి మేల్కొలిపి పంపెద. ఇక్కడకే మిక్కుటమగు పొద్దుపోయినది. నెలగుంకినది. పండుకొనుడనెను."

## గుణరత్నావళి.

### సప్తమపరిచ్ఛేదము.

అంతట రంగరాజు చాకలి సంగన్న పడమటింటిగదిలో పక్కవేసి న మంచముపైఁ బవ్వళించెను. చాకలి సంగన్నయు రంగరాజు మంచము సమీపముననే నేలపై పండుకొనెను.

తదనంతరము నాగమ్మ గృహకృత్యములు నవరించుకొని పడకటిం టి గదిలోనికేగి పట్టెమంచముపై బరుండెను.

తెల్లవారుజామాయెను. కోలికోడి కూసెను. అంతట నాగమ్మ రంగరాజును, చాకలి సంగన్నను లేపి పయనమునకు వేళయైనదని చెప్పి జాగరూకతతో నేగవలెననియు, మరల వచ్చునపుడు తన గృహమునకే రావలసినదనియు తనను మరచిపోవలదనియు చెప్పి వారలఁ వీడుకొల్పె.

రంగరాజును మడేలు సంగన్నయుఁ గృహమును విడచి నాలుగు సందులఁ దాటి రాజరస్తానుఁబడి విసవిస నడవసాగిరి. వఱువాత యవ్వటం. జేసి యానిశను యాయాయూర రాజరస్తా వృక్షముల క్రింద శయనించి తెల్ల వారుజాముననే వారివారి గ్రామములకుఁ బయనమై పోదలచుకొన్న కొందరుబాటసారులును, వీథియరుగులపై బరుండిన మఱికొందఱు తెరు వరులును, ,,ఒరే వెంకన్న ! ఒరే పుల్లయ్యా! తెల్లవారిపోవుచున్నది. ప్రొ ద్దెక్కక ముందాపల్లియఁ జేరవలెను. లేవండి; లేవండి" అని కొందరు మే ల్కొలుపుచుండిరి. అందింకను కొందరను జ్యేష్ఠాదేవి వదలమి. ,,అప్పుడే యె క్కడ తెల్లవారినదిరా? వెళ్లుదము తొందరేమి" యనువారు కొందఱును నేత్రములఁ నలుపుకొనుచు లేచువారుకొందఱును యుండిరి. అందొక

తెరువరి, గజమువంటివాఁడు, పెద్దయాలిచిప్పలంబోలు నేత్రములవాఁడు, మార్గమున విసవిసఁబోవుచున్న రంగరాజునుఁ బిలచి మీరేగ్రామము వెళ్ళెదరని ప్రశ్నించె.

అంతట రంగరాజు తాము క్షీరసాగరముఁ వెళ్ళుచున్నారమని ప్రత్యుత్తరంబిచ్చె. అందులకు పాంథుఁడు, మేమును మీరేగెడి గ్రామమునకే వచ్చుచున్నారము. తోడుగాఁ గలసి యేగవచ్చునని చెప్పి వెంటనున్నవారలనందఱను మేల్కొలిపి కలసి పయనమై బాటఁ సాగించిరి.

ఈబాటసారుల యజమానుఁడు నారాయణదాసు. శ్రీఘ్రుఁడు రంగ రాజారోహించిన యాకృతియశ్వమునే నారోహించెను. వీరు గ్రామముఁ దాటి దశపరుగు లేగునప్పటికరుణోదయమయ్యెను. తూర్పున, జలజాప్తుఁ డొక యగ్నిగోళచందంబున ధగధగ మెరయుచుండె. అంతకంతకుఁ దరణికిరణవారము హెచ్చుఁజొచ్చెను. వీరల తాపము మెండాయెను. పరిసరమున నేదైన నొకగ్రామమైనను లేదు. వాటింకను బరుగ్రగాఁ నిరువదిరెండుమైళ్ళేగవలయును.

రంగరాజు మాతృభాషలైన, తెనుఁగునందును, సంస్కృతమునందును నధికప్రియుఁడు. గొప్పజ్ఞాని. సర్వసద్గుణాలంకారుఁడు, మతాధిక్యతఁగలవాఁడు. రంగరాజునకు, మార్గమునఁ దనయశ్వముపైఁ బోవునపుఁడు, మాతృభాషాదుస్థితి డెందమునఁ దగిలెను. అందుచే దానినిఁ గూర్చి చింతించుచు, వెనుకకుఁ దగ్గుచు, తనతురగమును నెమ్మదిగా నడపించుచుండెను. అంతట నారాయణదాసు తనతురగమును వెనుకకుఁ మరల్చి రంగరాజును సమీపించి యాతని వ్యసనకారణమును, తనయశ్వమును నంతమందముగా నడపించుటకు హేతువును నడిగెను.

అందులకాతఁడిట్లనియె. “అయ్యా నారాయణదాసుగారూ! నా వ్యసనమునకేమియుఁ గారణములేదు. నామాతృభాషాదుస్థితియే నాదుఃఖమునకుఁ గారణము. తొల్లి మనమాతృభాషయైన తెనుంగును, సంస్కృతమును నెంతటిఘనత వహించినవి. ఎందఱినృపులచే నాదరింపఁబడినవి. ఆహా! నేటికాలమునకు మనతల్లి కిట్టిదుస్థితి తటస్థించె. “సుపుత్రాః క్రోంపవీకగాయన్నట్లు మనమాతకిందఱు సుపుత్రులు జనించి గృహనామమును వెలువఱచి వృద్ధిలోనికిఁ దెచ్చుటకు మారుగా క్రొంపను ధ్వంసముఁ జేయుచున్నారుకదా? అకటా! ఇట్టిబుద్ధిహీనులకు లజ్జలేదుకాబోలు. నీతివిహీనులమై తల్లికి హానిచేయుచున్నామనుమాటఁ దెలియఁగజాలకున్నారేమో. వీరినీతియేబుగ్గిలో కలసినది. వీరలకెంత జ్ఞానమున్నను, తమ మాతకు హానిచేయుచున్నామను మాట గ్రహింపఁజాలని వీరల జ్ఞానము క్షీరమును మంటిలో బోసినచందంబేకదా? ఎక్కడఁ జూచినను రాజభాష మితిమీఱి యెల్లరును నదేయభ్యసించుచున్నారు. ఏపుట్టయొద్ద నాలకించినను యాభాషే. ఏయువతి నేర్చినను యావిద్దియయే. ఎల్లెడఁజూచినను సాగరజలధిచందంబునఁ బ్రొంగిపోవుచున్నది; సరియే; మనరాజభాషయైన హూణంబట్లు వెలువలై పారుచున్నందుల కెంతయు సంతసించుచున్నాఁడ. ఏలనన, తల్లి, తండ్రి, గురువు, రాజు వీరు నల్వురును దైవహాంశసంభూతులుకదా? ఏనుదైవమునకెప్పుడు మనరాజభాషయైన యాంగ్లేయమును, వారిరాజ్యమును, శుక్లపక్షంపుచందురుని చందంబున వృద్ధియవునటులఁ బ్రార్థింతు. రాజభాషయందలక్ష్యముఁ జేసిన రాజద్రోహిమయాను. కావున రాజభాషయు పఠనీయమే. కాని మాతృభాషాహీనయులైన వీరు తల్లిని నంతపక్షపాతముగాఁ జూచుట క్షేమకరముగాదు. ఏలనన, మనమాతకు ప్రాప్తించిన యిడుమలే మనకిడుమలు. ఇరువదిపక్షములు మోసి కనిపించి వృద్ధిలోనికిఁ దెచ్చి సర్వకాలసర్వావస్థలయం

దును మనక్షేమమునే కోరుచున్న మాతకుఁ ద్రోహమాచరింపుచున్నఖలు లీ ఖలులుగాక మరేమనఁదురు. ఆహా! జ్ఞానమును కలిఁగియుసజ్ఞానమనెడి యంధకారమునఁబడిన యంధునిచందంబున నున్నారే. ఏమికాలవిపరీత ము. నేటికాలమునకు భార్యామణిగారు గృహమునఁ దిగినారుకదాయని తల్లివంకఁ నొకనేత్రముతోడనైనఁ జూడక, భార్యను పులకండము చం దంబున జూచిన యెంతసొంపుగానుండునుకి లేక చిన్నతనమునుండియు మనలకనిపెంచినది తల్లి; నేటిదినమునకు కదా మనభార్య వచ్చినది. దీని మాటయందు విశ్వాసముంచరాదు. మనతల్లి భార్యపై నెన్నికొండెము లంజెప్పినను న్యాయమును సహా పరిశీలింపక, తల్లి యన్యాయమాడునాయని భార్యపైఁబడి మర్దించిన యెంతయింపుగానుండునో యాలోచింపుఁడు. కావున, నోచదువరులారా! మాతృభాషాప్రియులారా! మాతృభాషాతన యులారా! మీరుఁ జేయుచున్న తప్పిదమును విచారించుకొనుఁడు. బయ లుదేరు సంతతికి నీతినిబోధించుటకుఁ మారుగా దుర్నీతిని బోధించి మహా ద్రోహమునుఁ జేయుచున్నారు. తొల్లి మనపూర్వులురచించిన గ్రంథము లనైనొక్కరును చూడరుకదా? కటకటా! పూర్వమెంతో ఘనతవహిం చిన గొప్పగొప్ప పురాణాదిగ్రంథములును శాస్త్రములును బీదపడియె. తొల్లి కాళిదాసు, నన్నయ, తిక్కన, పోతన్న మున్నగువారలు సంస్కృ తాంధ్రభాషలయందుఁ గడితేరి మాతృభాషను వృద్ధిజేనికిం దేవలేదా? దేశమున కత్యంతకృత్యముల నాచరింపలేదా? ఆహా!

గీ॥ „మోక్షలబ్ధికిఁ గేవలమూలమైన
జ్ఞానమును దెల్పు కృతులసంఖ్యాకములుగఁ
దొలి పెద్దలు రచియించిరెల్ల జనుల
కుడనను గ్రహమునఁజేసి యెసగ నెసఁగ॥

గీ॥ సంస్కృతజ్ఞానమవనిఁ బ్రకస్తిఁగాంచ
జగతి కెల్లను నొజ్జయై శాశ్వతము
గుఖ్యాతినందెను మనదేశమాత; యిందు
నించుకయు లేదుగా పరాపేక్ష మనకు॥

ఉ॥ ధీసకలత్వసంపదన
తీంద్రియదృష్టినిజేసి జైమిని
వ్యాసకణాదగౌతమ ప
తంజలులుంగపిలుండు మున్ను
పన్యాసమొనర్చినట్టి విపు
లాగమతంత్రముంబురాణముల్
భాసురవేద కల్పక గ
తన్మకరందమునాఁ దత్త్వవి
జ్ఞాసఁ జరించు భక్తులను
గావన్స్వయంభగవన్ని బద్ధమై
భాసిలు గీతయున్నిగమ
వర్గముదుర్గమయ్యె, శాస్త్రముల్
మాసెను, ధర్మనిష్ఠయు ఖి
లంబు ఖిలంబయిపోయె నియ్యెడం
బాసె నశేషవిద్యలును
వమ్మయిపోయె సమస్త సత్కళల్"

అని యీపద్యములంజదివి నారాయణదాసుగారికి వినిపించి వెం

డియు నిట్లనియె. నారాయణదాసుగారూ! ఇంతకును ముఖ్యహేతువైక మత్యములేకఁపోవుటయేకదా! ఐకమత్యమనెడి రత్నమే యున్నయెడ మనమాతృభాషకిట్టి దుస్థితి వాటిల్లునే? అనేకములగు గడ్డిపోచలు నొక వెంటిగానేర్పడి మదపుటేనుగును బంధించుచున్నవే. వేనవేలు పిపీలికము లేకీభవించి బలవంతమగు ఫణిని వధించుటలేదా? కావున సంఘీభావ మే బలమని మనమెఱుంగవలయు. మఱియు నొక్క గొప్పవింతఁ జెప్పెద నవలోకింపుఁడు. కర్మముచాలక గృహమునకొకఁడెవ్వఁడైన మాతృ భాషాప్రియుఁడు జనించెనేని వానిని యాభాషఁ జదువనీయక, పెక్కుడు మలఁబెట్టియుఁగొట్టియు దిట్టియుఁబాధించెదరు. తెనుఁగుకాని? సముస్కృ తమునుకానిపఠింపవలెనన్న వాంఛతో పాత్రముఁదెంచి రెండుమూఁడక్షరము ల నుచ్చరించుసరికి, యింటనుండి జనకుఁడో, జననియో హస్తమున నొక వేముంబట్టివచ్చి కరుణలేశమైనను లేక యెల్లవేళలయందు నదేపఠింతువని సెప్పి మోదుదురు. అకటా! కాంచువారికిని, వినువారికిని హృదయములు కఱుఁగవుగాబోలు. వీరలహృదయములు నల్లకొండశిలలు కాబోలు. “తాఁజెడ్డకోతి వనమంతయుఁ జెరచె”నన్నట్లు తాము మాతృభాషపై నొక్కనేత్రమైనను వైచక యొక్కభాషయందే డెందముఁ దగులుకొన్నవా రైయుండుటయేగాక జననిం బ్రేమించుచున్న యాబాలునితల్లినుండి నెడబాపుచున్నారే. అకటా! వారెట్టివారైయుందురు? ఓమాతృభాషా ప్రియులారా! మాతృభాషాతనయులారా! మాతృభాషోద్ధారకులారా! జ్ఞానులయ్యు, నజ్ఞానసాగరమునఁ మునుంగుచుఁ దేలుచున్న యాంధ్రు లారా! మనరాజ్యపాలకులగు హూణులు మనలఁకు నీతిని బోధించుచున్నారే. కొంచెమాలోచింపుఁడు. వాస్తవముగా మనవారు వారిని మన

కంటె హీనజాతివారిగా నెంచినను వారలను నుతించక పోయినను, వారలా చరించుచున్న కృత్యములంబట్టి వారలు ఘనులేగాని కొద్దిపాటివారు కారనియు, వారలాచరించుచున్న కృత్యములంబట్టి చూచినవారు ప్రపంచకమున కంతకును నీతిని బోధించుచున్నారనియు నాయభిప్రాయము. మఱియు,

"చ॥ చెనుకులమందు సంభవముజెందిన మానవుఁడైన, వానికిం
గనుగుణంబులున్న నుతిగాంచుటకర్హుఁడుగాక గర్హుఁడే?
పుడమినిగంటకాకులను భోగికులావృతమైన కేతకిన్
బొడమినవయ్యు గర్భదళముల్ గొనఁ బాత్రముగాదె మిత్రుఁడా."

అట్లు, కులమందేమియుఁ లేదు. నిర్మలవిజ్ఞానవిశారదుఁడును, బ్రహ్మజ్ఞానతత్పరుఁడును నగు గుణరత్నాకరుఁడే బ్రాహ్మణుఁడు. నుతిగాంచుట కర్హుఁడు. కాని జాతిచేత ఘనుఁడయ్యు నాచరించుకృత్యము లెల్ల నీచునికన్నను కనిష్ఠముగానున్న వాఁడు నుతిగాంచుటకుఁ గర్హుఁడే గాని యర్హుఁడు గాఁడు. ఇంతయేల? సుత్రామసహస్రపత్రభరణరక్షకుఁడును, విశ్వమోహనుఁడును, దైత్యారియు, నందకుమారుఁడును నగా శ్రీకృష్ణుఁడు పాండవుల రాయభారియై కౌరవులకడకేగినపుఁడు దుర్యోధనుని గృహమున విడియక కులముచేఁ సూద్రుండగు విధురునియింటవిడసె. అంతటఁ ధృతరాష్ట్రనందనుఁడు, దుర్యోధనుఁడు, శ్రీకృష్ణునివద్దకేతెంచి

యుత్తమక్షత్రియకులసంజాతులును, చుట్టములునునగు వారిగృహములకుఁ బోక సూద్రునియింట భుజించుటకు హేతువడిగినతరి శ్రీభగవానుఁడు వానికేమని నీతిబోధించె? కావున రాజపరిపాలకులతిశ్లాఘనీయులేయని నుడువుచున్నాడను. ఉదయాద్రి మొదలు, హస్తమాద్రివఱకును వారి మాతృభాషవ్యాపింపని దేశముకలదా? కావున వారలఁగాంచి స్తుతినిం దెచ్చుకొని మాతృభాషపై నొకనేత్రమును నుంపుము. శ్రీమదఖిలాండకోటిబ్రహ్మాండ నాయకుఁడును, నిర్వికారుఁడును, కర్మసాక్షియు, దనుజకుల మర్ధనుఁడునునగా భగవంతునిచే సృష్టింపఁబడిన యీమాయావికారమైన ప్రపంచమునంగల కోటులలోదికెల్లను జంతుకోటియు నందు మానవజన్మంబును నుత్తమోత్తమమైనది. అందు పురుషుఁడై జనించుట గొప్ప పుణ్యాత్మునికిఁ గాని లభింపదు. ఇఁకనట్టి యుత్తమజన్మంబెత్తినందులకు మానవుని కృత్యమేమైయుండును? లోకమునకుఁ దనశక్తికొలఁదినిపాటుపడి పురుషార్థకములను సంపాదించుటయే. పురుషార్థకములు చతుర్విధంబులు. అవేవన, ధర్మార్థకామమోక్షములు. ఇందు మానవుఁడు సంపాదింపవలసిన పురుషార్థకమంత్యపురుషార్థకమే. ఇది సంపాదించుట సులభసాధ్యముఁగాదు. ఇఁక నీమోక్షమనెడి పురుషార్థకరత్నమును పొందుటకేదైన తెరువుఁ గలదాయని ప్రశ్నించుకొన్నచో, * సదాదైవభక్తితత్పరుఁడై, హేయమై, వినశ్వరమైన యీశరీరమునందును, ధనమునందును యాస్థమాని తనమాతృభాషను, కులమును వ్యాప్తిలోనికిఁ దెచ్చుటకై పాటు

* అనగా రాజభాషను నిరాకరించి, రాజభాషను పఠింపక, దొరతనసంబంధమగు పనులఁ జేయగూడదని ధనము నార్జింపరాదనియు కాదు. రాజభాషను పఠింపవచ్చు. దొరతనోద్యోగములఁ జేయవచ్చు. ధనమును నార్జింపవచ్చు. కాని రాజభాషను

పశులయే యామోక్షమనియెడి రత్నముఁ బొందుటకుమార్గమని తెలుచు న్నది. అటులఁ బాటుపడినవాఁడే సకలగుణరత్నాకరుఁడు లోకోత్తముఁడు నుతిగాంచుట కర్హుఁడు. వానికి మోక్షము కరస్థము. అటులఁ బాటు పడనివాఁడు సకలదుర్గుణరత్నాకరుఁడు. లోకాధముఁడు. నుతి గాంచుటకు గర్హ్యుఁడు. మఱియు వానిముఖము మార్జాలముఖము కన్నను కనికష్టము. వఱువాతలేచి వానివదనముఁ దర్శింపరాదు. దర్శించి నవానికానాఁడు కీఁడు మూడినదనుకొనవలెను. మనము కలకాలము బ్రతుకఁబోము. మనప్రాణము బుద్బుదప్రాయము. జీవించిన లేశకాల ములోనైనను ప్రపంచముపై నుడివిన సధర్మకార్యముల నాచరింప వలయు. మనల వెనువెంటవచ్చునది కీర్తియే. కావున మనమాతృ భాషకై పాటుపడవలెనని చెప్పి వెండియు నిట్లనియె. నారాయణదాసు గారు! మఱియొకవింతఁ జెప్పెద నవలోకింపుఁడు. మాతృభాషయందు వ్యాకరణమంతయు మూలఁబడియె. ఏబాలుని కాంచెదమన్నను వ్యాక రణనామము నుచ్చరించుసరికే శిరోవేదనము మొదలుపెట్టు. అకటా! ఇదియంతయు మనల పెద్దలబుద్ధిలేమిచేతనేకదా? అదియేయున్నయెడ మనమాతృభాషకట్టిదుస్థితియేల సంభవించు? ఐకమత్యమేయున్నయెడ మనదేశమాత యెంతటి యున్నతస్థానమున నధిష్ఠింపవలసినది. మఱియు నిక్కాలమున మాతృభాషాప్రియులు కొందఱున్నను వారలలో వార

---

చదివి యుద్యోగములఁ జేయుచున్నాముకదాయని, తమమతమును, మాతృభాషను విడనాడి యన్యమతభాషయందే డెందముఁ దగులుకొనియుండరాదనియు, పక్షపాతబుద్ధి లేక రెంటిని సమముగాఁ జూడవలెననియు, లేక, కొంచెమభిమానముంచి మాతృభాషయందే యధికశ్రద్ధఁ బూనవలెననియు భావము. మఱియుఁ ధనము నార్జించుటయందంతగా నాస్థ నుంచుకొనక, యార్జించుధనమును న్యాయరీతిని యార్జింపవలెననియుఁ గ్రహింపవలెను.

లకై కమత్యమనెడి మాట సూన్యమైయున్నది. వారలు ద్విభాగములైరి. అందుకొందరు గ్రామ్యభాషయే వాడికయందుండవలెననియు, మఱికొందరు వ్యాకరణయుక్తంబగు భాషయే వాడికయందుండవలెననియు వాదులాటలు పెట్టుకొనిరి. సరియే వ్యాకరణయుక్తంబగు భాష వాడికయందుంచవలయునన్న బాగుగనేయున్నది. కాని గ్రామ్యభాషయుక్తమగుభాషయనుమనవారు నూతనముగాఁ దెచ్చిపెట్టుట ‚‚నాకవిత్వము కొంత తాటిపాకవారి పయిత్యము కొంత” యన్నట్లున్నది. తొల్లి మన పూర్వులే గ్రంథముల గ్రామ్యమందు రచించిరి? అట్టి గ్రంథములను వేటిని కానవే. ఇంతకుఁ గ్రామ్యంబననేమి? వ్యవహారసిద్ధంబై లక్షణవిరుద్ధంబగు భాషకదా? కావున నట్టి సమయమున గ్రామ్యమనెడి మాటను మఱచిన బాగుండునని నాతలంపు, వ్యాకరణయుక్తముకాని భాషయేమి భాష. వ్యాకరణయుక్తముకాని పాత్తములేమి పాత్తములు. వ్యాకరణయుక్తముకాని వ్రాత యేమి వ్రాత. వ్యాకరణయుక్తముగాక గ్రామ్యముగా రెండు మూఁడు తరగతులు చదివిన యంగన వ్రాయగలదు. మఱియుఁ బూర్వాచారప్రకారమాచరించుటయే శ్రేయఃకరము. సాధ్యమైనంత వఱకు బూర్వాచారమునుబట్టియే చరించవలెను. వారలు మనల నిటుల నాచరింపవలయును నటుల నాచరింపవలయునని బుద్ధిహీనులై చెప్పలేదు వారలవాతులనుండి వెలువడిన ప్రతిపలుకునందును నీతి కలదు. ఆనీతులఁ బుద్ధిమంతులు గ్రహింతురుగాక. గొప్పవారైనమనపూర్వులయాచారముల విడనాడుట క్షేమకరముగాదు. పూర్వులకంటె గొప్పవారిలమని తలంపకుఁడు. గ్రామ్యభాషను బోధించుచున్నారనిన బాలుర నాశన

ము జేయుచున్నారనియే నమ్ముఁడు. కావున గ్రామ్యమును విడనాడి వ్యాకరణయుక్తంబగు భాషను వాడెదరుగాత. అట్టివారలకు దైవంబు సకలకోర్కెల నీడేర్చుఁగాత" యని రంగరాజు నారాయణదాసుగారితోఁ జెప్పుచుండ భయమున గడగడవడఁకుచు నాగతి యిట్లామెనని చెప్పు కొనుట కరుదెంచిన యంగనచందంబున మనతల్లి, భారతి ఆయన నేత్రము లకుఁ గట్టినట్లు కాన్పించె. అంతట రంగరాజు తురగముదిగి నిలువఁబడి యుచితరీతిని నమస్కరించి యిట్లనియె

ఉ. "మాతరో! నీసుతుల్మనువు మాన్యచరిత్రులమేయ శేముషీ
ఖ్యాతులునై యనారతమఖర్వగతింధనధాన్య సంపదల్
ప్రీతికమెంచుగాఁగలిగి పేదరికంబునఁ బీదలై కలాచాతురిశౌర్య
సంపదల శాస్త్రపరిశ్రమమించిరెంతయున్॥

ఉ॥ ఈతఱిఁజూడ వారు ధన
హీనులు దీనులు సోమరుల్నయా
పేతులునై యజస్రమును
బేదరికంబున మున్గియెంతయుఁ
న్నీతివివేకులై బలము విద్యయుఁ
బుద్ధియుఁ దక్క శీలమున్నీతియు
జాతియున్మఱచి నీచదశంబడియుండిరిక్కటా!

సీ॥ తల్లిరో! క్షమదిదైన్యంబుదక్కము
నిరతిశయంబగు నీదు పూర్వ
విభవంబు బహువిధవిద్యాసమగ్రత

సకలకలాజాలసౌష్టవంబు
రాజకసాంఘికప్రముఖ నానావ్యవ
హారసౌమ్యతయుఁ బెంపారఁ గాంచి
సర్వసర్వం సహాచక్రవసతంసంబుఁ
బురుషార్థసర్వస్వపూర్ణఖనియు
గీ॥ మోక్షవిద్యాలతాలవాలమును నుదాత్త
ధర్మకల్పద్రుమూలంబు ధాత్రి వేశ
సంతతికి నొజ్జయునునయి సాటిలేక
యవనిఁ బ్రఖ్యాతిఁ గాంతు వీవచిరమునను॥

శా॥ ఉత్సాహంబున నీతనూజులు ప్రశ
స్తోద్యోగముంబూని దుర్మాత్సరంబులు
నీడి యేకమయి నీమహాత్మ్యముంబూ
ర్వసంవిత్సంపత్తియు సత్కలాకుశ
లతన్విఖ్యాతివాణిజ్యసంపత్సంసి
ద్ధియుఁ గూర్పఁ గాంచెదవఖర్వంబై నయౌన్నత్యమున్”

అని పైనచెప్పిన తెఱంగున తల్లికి పూర్వకాలమునకును ప్రస్తుతకాలమునకును వ్యత్యాసములం జెప్పి, తగుకారణంబులం జెప్పి, యాబిడ దుఃఖమును నివారణఁజేసి వీడుకొల్పె. తదనంతరము నారాయణదాసుగారు రంగరాజునకనేకవందనములాచరించి యిట్లనియె. రంగరాజా! నీవింతటి ఘనుఁడవని యేనెఱుఁగను. నీశక్తి యిప్పటికిఁ దెల్లంబయ్యె. భారతి దర్శనంబున పావనుండవైతివి. మీముఖారవిందమునుఁ గాంచుటవలన

మేము పావనులమైతిమి. మీమతాభిమానమునకును, మాతృభాషా ప్రియమునకును నేనచ్చెరువొందుచున్నాఁడను" అనిచెప్పి కొంతతడవూరకుండి వెండియు నిట్లనియె. "రంగరాజా! నేను వేనవేలుగఁ గతలఁ విన్నాఁడను. కాని, అవియన్నియు నాడెందమునకంతగా యింపును కలిగింపలేదు. నాకనేకదినములనుండియు గొప్పకవులయొక్కయు శూరులయొక్కయు, చారిత్రముల వినవలెనన్న వాంఛయొక్కటి డెందమునఁ గుందుచున్నది. ఎవరేకతలజెప్పినను కాశీమజిలీకతలను, హంసవింశతి మున్నగు కతలనే సెప్పెదరుకాని గొప్పకోవిదులయొక్కయు శూరులయొక్కయు, చారిత్రములం జెప్పరు. నేటికినాకోర్కిడేరెనని తలఁచెద. మీవచనామృతముచేతను, మీముఖారవిందమును కాంచుటచేతను నాగేహము పావనంబయ్యె. మఱియు నాకుఁ జిరకాలమునుండియు నాహృదయమునఁ గుందుచున్న వాంఛ నీడేర్చి నన్ను గృతార్థుంజేయఁ బ్రార్థించుచున్నాఁడను." అన విని రంగరాజిట్లనియె.

నారాయణదాసుగారు! మీరు నన్నింతగా కొనియాడఁదగదు. మఱియు మీరు నన్నడిగినయట్లు మీడెందమునఁ గలవాంఛఁ నీడేర్చెద. మీవంటి సంగాతికానిని నెందునుఁ గానను. మఱియు మీరు నన్నడిగిన హంశము నాదుఃఖమునెల్లను పారదోలె. ఏలనన నేను యిట్టికతలం జెప్పుటయందు విసుగు విరామమును లేకఁ జెప్పెద. కాని నేనెవరికేకతనుఁ జెప్పచూచినను, ప్రారంభించినతోడనే మీరు నుడివినయట్లు, "మాకాశూరులయొక్కయు, కవులయొక్కయు చారిత్రములక్కరలేదు. కాశీ మజిలీకథలనైనను, హంశవింశతకథలనైననుఁ జెప్పి మాహృదయముల నంతోషపెట్టుము" అని నుడువువారేకాని యీచారిత్రముల నాలకింపువారెవ్వరును లేరు. నేఁడుగా మీవంటివారిమైత్రి యాభగవానుఁడు

కూర్చినాఁడు. నాకోర్కెలీడేరె. కావున నీకిప్పుడు కవిసంతతిని పోతపోసినా డన్నఖ్యాతింగాంచిన బమ్మెర పోతరాజకవిచారిత్రమును క్లుప్తముగాఁజెప్పెద. సావధానుఁడవై యవలోకింపు" అనిచెప్పె.

## అష్టమప్రకరణము.

### బమ్మెర పోతరాజు.

ఈకవి శాలివాహనశకము ౧౩౦౦ వ సంవత్సరము నందనఁగా హూణశకము ౧౩౭౮ వ సంవత్సరమునందు జనించినట్టు తెలుఁగుభాగవతమును ముద్రించినవారు పీఠికయందు వ్రాసియున్నారు. ఈతనినివాసస్థలము కడపమండలములోని యేకశిలానగరము. ప్రస్తుతమీనగరము "ఒంటిమెట్ట" యనునామమున వ్యవహరింపఁబడుచున్నది. ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఈతనిజనకుఁడు కేసన; జనని లక్కమ్మ; పుత్రుఁడు మల్లన్న. ఇతఁడు కౌండిన్యసగోత్రుఁడు శ్రీనాథుని భ్రాతరుఁడు.

ఈతఁడు సంస్కృతాంధ్రములను తాను గురుముఖమునఁ జదువక స్వయంకృషివలననే అపారమైన ద్విభాషాపాండిత్యమును సంపాదించినాఁడు. ఇదియే యీకవియందుఁగల ప్రతిభావిశేషము. ఇప్రతిభావిశేషమే సహస్రవాతులం జాటుచున్నది. ఈతఁడుపాధ్యాయుని ముఖమున

విద్దియనభ్యసింపక పోవుటచేతనే యితఁడు గద్యమునందు "సహజపాండి త్య" యని వేసికొన్నాఁడు. మఱియు నితఁడుభయ భాషలయందును పరిపూర్ణపాండిత్యమును, ఒకయోగి యుపదేశమున సంపాదించినట్లు ను కాన్పించుచున్నది. ఈతఁడు తనబాల్యావస్థయందొకనాఁడు గోవులను మేపుటకై గ్రామపరిసరముననేయున్న యొకకాననమునకేగినప్పుడు చిదా నందుఁడను యోగి యీతనికి రామమంత్రముపదేశించెననియు, దీనిని బట్టియే యీతఁ డుభయభాషలయందు నపారపాండిత్యమును సంపా దించెననియుఁ గొందరు నుడువుదురు. మఱియు "శ్రీపరమేశ్వర కరుణా కవితావిచిత్ర" యను భాగవతగద్యను మున్నగువాటినిఁ బట్టి విచారించి చూడగా శివప్రసాదమున పరిపూర్ణపాండిత్యమును సంపాదించినట్లును తేలుచున్నది. కాని, యీతఁడెట్లు పరిపూర్ణపాండిత్యమును సంపాదించి నను యాభగవానుని కృపవలననే సంపాదించెనని నుడువవలెను. ఏలనన, దైవసహాయములేమి, నరుఁడభివృద్ధిలోనికివచ్చుట దుర్లభము. అతఁడు "సహజపాండిత్య" యనివ్రాసినను, రామమంత్రోపదేశమువలన వచ్చి నదనివ్రాసినను. యాభగవానుఁడట్టి గొప్పవరప్రసాదమునిచ్చెను కావున యంతటిఘనుఁడాయెను. కావున యాతఁడింతటిపాండిత్యము నెట్లుసంపా దించెనను విషయమునుగుఱించి యంతగానాలోచింప నవసరములేదు. ఏదెట్లున్నను యీతఁడు దైవహంశసంభూతులలో నొకఁడని యెంచ వలెను. ఈతని సుగుణములు వర్ణనాతీతములు. ఈతనివాక్కులమృతము వంటివి. ఈతనినామము సకలపాపహారిణి. ఏకవియందునులేని ఘనత యీ కవియందు గాన్పించుచున్నయది. ఈతఁడు కవితనంతను పోతపోసి నాఁడు అందుచేతనే యీతనినామముకూడ "పోతన" యని ప్రసిద్ధికెక్కి నది. ఈతఁడు కవిత్వమునుకంతటికిని పోతపోసిన హేమమువెలుగును

తెచ్చినాఁడు. ఈతనియందే కవియందును లేనట్టి సుగుణములెవ్వియన ఆతఁడితరకవులచందంబున ధనమున కాశించి, పోత్తములరచించి, యే నృపులకు సంకితముజేయలేదు. తానురచించినగ్రంథములనెల్లనై కుంఠపుర వాసుఁడును, సుతామకళతాభరణ రక్షకుఁడును, మురారియుఁగా భగవానుని కంకితముఁజేసె. ఏనృపుఁడెన్నివిధముల యాపోతరాజును తాను రచించిన గ్రంథముల తమపేర సంకీతము చేయవలయునని బ్రతి మాలినను వారల కంకితము జేయలేదు. అంత్యమున నానృపులాగ్రహా వంతులై యీతఁడు రచించిన పోత్తములం గోతులందియించి పాతిపెట్టి నను వారలకు భయపడలేదు. వారలకంకితముఁ జేయలేదు. ఇందుల కొక్క తార్కాణంబు కలదు.

ఈకవిరాజోత్తముని కొకానొకసమయమున శ్రీరామమూర్తి స్వ ప్నముః దర్శనమిచ్చి భాగవతమును శ్రీరామాంకితముగా తెనిగింపవలయు నని యాజ్ఞాపింప యాతఁడాతని యాజ్ఞకు బద్ధుఁడై భాగవతమును శ్రీరా మాంకితముగా తెనిగించెను. ఈవార్త కర్నాటప్రభువు విన్నవాఁడై తన కాగ్రంథము సంకీతముఁజేయవలయునని పోతరాజును కోరగా, యాతఁ డందులకంగీకరింపలేదు. అంతట తనయాస్థానపండితుఁడును పోతన్న భావమఱిదియునగు శ్రీనాథునితో పోతరాజు రచించిన భాగవతమును తనకంకితముఁ జేయవలెనని యాతనితోడఁ జెప్పి తనకంకితముఁ జేయింప వలయునని యాతనిని పంపెను. పోతరాజు యితరకవులవలె రాజుల నాశ్రయించినవాఁడుకాడని నుడివితినికదా? మఱియు నాతఁడు ధనవంతు డునుకాడు. కాని కృషికర్మచే గాలంముంగడపుచుండువాఁడు. శ్రీనా థుఁడు కర్నాటరాజును విడచి, పల్లకిపై నారోహించి యేకశిలానగరమున కేగుదెంచుసరికి పోతనయు, కుమరుఁడును యూరిబయలిపొలములో నుండిరి. అంతట శ్రీనాథుఁడు పొలమునకరుదెంచి పోతన కుమరునిచే

యరకకట్టించి దున్నించుచుండుట గాంచెను. అంతట శ్రీనాథుఁడు తన మహత్త్వమును పోతనకు చూపింపవలెనన్న తలంపుతో బోయీలనొక ప్రక్క బొంగు వదలివేయుఁడని యాజ్ఞాపించె. అంతట పల్లకీబోయీలు లేకయే నడచుచుండెను. అది పోతన పుత్త్రుఁడు మల్లన గాంచి జనకునితోఁ జెప్పఁగా నతఁడు నాగలికాడికిఁ గట్టిన యొకదున్నను విప్పమని యాజ్ఞాపించెను. ఒకప్రక్క దున్న లేకయే యరక సాగుచుండెను. ఇది శ్రీనాథుఁడు చూచి రెండవదండినికూడా విడువుఁడని బోయీల కాజ్ఞాపించి పల్లకీని నడపుచుండెను. అది పోతన గాంచి రెండవవైపు నున్న దున్ననుకూడా విప్పించి నాగలిని సాగునట్లు చేసెనట. తదనంతరము శ్రీనాథుఁడు పోతనను సమీపించి పరిహాసపూర్వకముగా హాలికులు కుశలమాయని కుశలప్రశ్న చేసెను. అంతట పోతన,

ఉ. బాలరసాలసాల నవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుకూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైననేమి నిజసుతోదరపోషణార్థమై॥

అని ప్రత్యుత్తరమిచ్చెనఁట! అంతట శ్రీనాథుఁడు లజ్జాకరుఁడై ముఖమును చిట్లించుకొని బావమఱఁదులాడిన పరిహాసములకు కోపగింప నగునాయని సమాధానపఱిచెను. తదనంతరము మల్లన గృహమునకు ముందుగానేగి భోజనపదార్థముల నిమిత్తమై ప్రయత్నించి లభ్యములు కాక దుఃఖముతో దా నూరఁదిరుగుచుండ యానారాయణుండు పోతన్న రూపమున వచ్చి పంచభక్ష్యపరమాన్నములతో విందుచేయుటకు దగిన పదార్థముల నిచ్చి చనియె. భోజనానంతరము శ్రీనాథుఁడు పోతన్న బీద తనముఁగాంచి ప్రస్తావించి భాగవతమును తనప్రభునకంకితముఁ జేయవల

సినదని కోరెను. అంతట భారతి పోతన్న శ్రీనాథుని సభ్భువకంకితము
జేయునేమోయను భీతింజెంది పోతనమెదుటం గడగడ వడంకుచు నిలు
వంబడియె. అంతట పోతన్న భారతినికాంచి హస్తములంజోడించి వినయ
పూర్వకముగ వందనమాచరించి,

ఉ॥ కాటుక కంటనీరు చనుకట్టుపయింబడనేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడలయో మదంబయో
హాటకగర్భురాణి నిను నాఁకటికిం గొనిపోయియల్లక
ర్ణాటకిరాటకీచకులకమ్మఁ ద్రిశుద్ధిగనమ్మ్మను భారతీ॥

అని వాణి నోదార్చి, శ్రీనాథునితోడఁ దాను తాను రచించి
న భాగవతమును కర్ణాటకరాజున కంకితముం జేయననియు శ్రీరామాంకిత
మొనదనియుం జెప్పి వీడుకొల్పెను. తదనంతరము కర్ణాటరాజు మహో
గ్రుడై, కట్టికొని తెండని కొందరభటులం బంపె. అంతట నారాయణుం
డు శ్వేతవరాహ రూపమ్ముం దాల్చి పోతన ద్వార సమీపమునం బరుండి
కర్ణాట రాజభటులతోడఁ బోరాడి సాగనంపెను. మఱియు నీతడష్టమ
స్కంధములోని గజేంద్రమోక్షకథను వ్రాయుచు ,,అలవైకుంఠపురంబు
లో నగరిలో నామూల" యను పద్యము రచించి పై భాగము
తోచక చింతిల్లుచు వెలుపలికిఁ బోయినప్పుడు శ్రీరాముండరుదెంచి ,,సౌ
ధంబుదాపల" యని పూరించిపోయెను. మఱియు, బమ్మెరపోతరాజు వ్యా
సవిరచిత భాగవత పురాణము నాంధ్రీకరించెనన్న వార్తను సర్వజ్ఞసింగనా
యఁడు విని తనయాస్థానమునకు రప్పించి గ్రంథమును చదివి, తనకాగ్రం
థమును కృతి యివ్వవలయునని ప్రార్థించెను. అందులకాతఁడు తన గ్రం
థమును నరాంకితముఁ జేయనని నృపుని ప్రార్థన నంగీకరింపక పోఁగా రా
జు కోపముతో నాతని గ్రంథమును భూమిలో గోయితీయించి పాతిపెట్టిం

చెను. తదనంతరము శ్రీరామమూర్తి యారాజు భార్యయొక్క స్వప్నము లోవచ్చి భర్తనువేఁడుకొని భాగవత పురాణము ప్రపంచములో వ్యాపింపఁజేయ ప్రార్థింపుమని యామెతో జెప్పిపోయెను. తదనంతర మామె, అహస్కరోదయముననే భర్తతోడ తన స్వప్నవృత్తాంతమెల్లను తెల్లంబుగా వినిపించె. అంతటాతఁడు పోత్తములను పైకి తీయింపఁగా నందలి తాళపత్రములు కీటకములు తిని బహుభాగములు శిథిలములైపోయెను. తదనంతరము శిథిలమైన భాగములు గంగనాది కవులు పూరించిరి. ఆహా! పోతనవంటి కవిరాజెవఁడును లేడుకదా? తాను రచించిన గ్రంథముల రాజు నృపుంను తన్ను కంకితము జేయుమని ప్రార్థించినను ప్రార్థనల పెడచెవులం బెట్ట కోపచేతస్కులై యాతనిని భటులచే కట్టితెండని పంపినను కొట్టి తెండని పంపినను, యాతఁడు రచించిన గ్రంథముల భూమిలో పాతిపెట్టించినను మత్తేమి యాచరించినను, వారల కించుకయు జంకక, వారల కంకితముఁ జేయలేదే. ఇతరకవులవలె ధనమున కాశింపలేదే. ఈతని వాయి నుండివెడలిన వాక్కు జఱిగి తీఱినది. అహా! ఇట్టివాఁడు వాస్తవముగా కవిరాజుకాని, యన్యులు కవిరాజులా? ఈతనియందు గల మహిమ యే కవియందునుకలదు? ఈతని కవితా నైపుణ్యతయు నీతని పద్యరచనయు యేకవికిలభించినది? ఇదియంతయునేల ఆతని నామమే యాతని మహిమను వెల్లడించుచున్నది. ఈతఁని చారిత్రయంతయు నీతిబోధకము. ఈతని చారిత్రమెల్ల కవులకును నీతినిబోధించుచున్నయది. మఱియు, పోతన తనగ్రంథముల నరాంకితమును చేయకపోవుట గొప్పగా భాగవతమునందీ క్రింది పద్యముచేతఁ జెప్పకొన్నాఁడు.

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చిపురంబులు వాహనంబులుఁ
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసికాలుచే

సమ్మోట వేొటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పనీ
యమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్.

ఈతని కవిత్వము సర్వజన శ్లాఘాపాత్రమై భక్తి రసపూరితమై చదువరుల మందానందాపయోధి నిమగ్న చేతస్కులం గావించునదియై నిర్దోషమై పదలాలిత్యముఁగలదయి, శ్రావ్యమై, దనరారుచుండు. మఱియు, నీతఁడు రచించిన గ్రంథమునం దక్కడక్కడ కొన్ని నెరసులు పొడ కాంచినను, యానెరుసు లీతనివియైయుండవు. ఏలనన, యీతఁడు రచించిన గ్రంథము భూమిలో పాతిపెట్టబడినదనియు నది తదనంతరము పైకిదీయునప్పటి కందు కొంతభాగము కీటకములు తినివేయుటం జేసి శిథిలమైననియు తదనంతరము శిథిలభాగముల గంగనాది కవులు పూరించిరనియు నిదివరకే నుడివియుంటినికదా? కావున యందుంగల నెరుసులు వారలవై యుండవచ్చును. ఒకానొకవేళ ప్రమాదవశమున నీతనివేయైనను, యవియన్నియు నొక లెక్కలోనివికావు. ఎంతఘనుని యందైనను లేశమైనను పొరపాటుండక మానదుకదా? పూర్ణచంద్రబింబమునందు సహితమొక్కనల్లని మచ్చలేదా? కాని వేయ రత్నములలో నొక గులకరాయియెంత. ఈతని కవిత్వమునందు దోషములులేవను హంశమమెదార్థమనుటకు కూచిమంచి తిమ్మకవి చెప్పిన యీక్రింది పద్దియము ప్రబలముగానున్నది.

సీ. ఘనుఁడు పోతన మంత్రి మును భాగవతము
రచించి చక్రికి సమర్పించునెడల
సర్వజ్ఞసింగ యతణ్ణావరుండది తనకిమ్మని
వేడగా నీయకున్న
నలిగి యాపుస్తకం బవనిఁ బాతించినఁ
జివికి యందొక కొంత శిథిలమయ్యెఁ

గ్రమ్మఱునది వెలిగందల నారపరాజును
మఱి పోరప్ప రాజు గంగ
రాజు మొదలగు కవివరుల్ తేజ మెసఁగఁ
జెప్పి రాగ్రంథముల యందె తప్పులొదవెఁ
గాని పోతకవీంద్రుని కవితయందు
లక్షణం బెందుఁ దప్పనా దక్షహరణ॥

ఈతఁడు భగవద్గుణ వర్ణనలు వచ్చినప్పుడు తనభక్తి తేటబడునట్లుగా తేటగా బాగుగా వర్ణించుచు పొగడుచు రచియించినాఁడు. ఈతఁడు భాగవతమును రచియించునపుడు కవినుడివిన దెల్లను ప్రత్యక్షముగా జరుగుచు వచ్చెననియు, రుక్మిణీకళ్యాణమును రచించుచు, "దేవకీసుతు కోర్కితీగలు వీడంగ" నను పద్దియము నందు "బాలకమరె" యను భాగమును పూరించు నరి కాతని తనయ కుంపటిలోఁ బడి కమరిపోయెననియు "పద్మనయను వలన బ్రమదంబు నిండారె" నను భాగమును జెప్పఁగానే మరల లేచి యథారీతిని యాచిన్నది సౌఖ్యముగా నుండెననియు జెప్పెదురు.

ఈకవి వీరభద్రవిజయమను యొకపొత్తమును రచియించెను. ఈతఁడు దక్షయజ్ఞకతను వ్రాయునపుడు "అనయంబులుప్తక్రియాతలాపుఁడు మానహీనుఁడు మర్యాదలేని వాఁడు మత్తప్రచారుఁడు న్మత్తప్రియుడు" అనియు "వసుధనెవ్వారు ధూర్జటి వ్రతులు వారు వారి కనుకూలురగుదు రెవ్వారు వారలట్టి సచ్ఛాస్త్రవిపంథులైన వారు ననని భాషంతులయ్యెద" రనియు మహేంద్రదూషణ మధికముగాఁ జేయఁబడి యుండుటచేఁ దత్పాప పరిహారార్థముగా రచియించినట్లుదాను రచియించినవీరభద్రవిజయమున నిట్లు చెప్పినాఁడు.

ఉ. భాగవత ప్రబంధమతి భాసుర తన్నచియించి దక్షకృ
ద్యాగకథాప్రసంగమున నల్పవచస్కుఁడనైతిఁ దన్నిమి
త్తాగమవక్త్రదోషపరిహారతకై యజనైక శైవశా
స్త్రాగమవీరభద్రవిజయంబు రచించెద వేడ్కతోఁ గృతిన్.

పోతనామాత్యుని కాలమును నిర్ణయించుటకు కొంత యాధారము భాగవతమునందే కలదు. పోతరాజ భాగవతమున కొంతభాగము శిథిలముకాగా దానిని సింగన గంగన యెఱ్ఱాప్రెగడ మున్నగు కవులు పూరించిరని యిదివరకే నుడివియుంటిని కదా? షష్ఠస్కంధమును రచించిన యేరుచూరి సింగయ తానెఱ్ఱాప్రెగడమను మని మనుమఁడయినట్లు షష్ఠస్కంధములో నీక్రింది పద్యమువలనం దెలుపుకొన్నాఁడు.

సీ. శ్రీవత్సగోత్రుండు శివభక్తి యుక్తుఁడాపస్తంబ
సూత్రుఁడపార గుణుఁడు,
నేర్చూరి శాసనుం డెఱ్ఱన ప్రెగ్గడ పుత్రుండు
వీరన పుణ్యమూర్తి
కాత్మజుఁడగు నాచె యామాత్యునకుఁ బోల
మాంబకు నందను లమితయశులు
కసవనామాత్యుండు ఘనుఁడు వీరన మంత్రి సిం
గధీమణియునం చిత గుణాఢ్యు
లుద్భవించిరి తేజంబు లూర్జితముగ
నారిది మూర్తిత్రయం బన శుభ్రకీర్తిఁ
బరఁగి రందులోఁ గసవన ప్రభువునకును
ముమ్మడమ్మను సాధ్వి యిమ్ములను వెలసి.

కం. అకసవయమంత్రికిఁ బు
ణ్యైకల్ప శుభాంగి ముమ్మడమ్మయు ముమున

వ్యాకుల చిత్తుల నియుపుర
శ్రీకరగుణగణుల బుణ్య శీలురఁగాంచెన్.

పోతనామాత్యుని తదనంతరంబ షష్ఠమస్కంధమును రచించిన సింగయ యెఱ్ఱాప్రెగడకు మనుమనిమనుమఁడై నప్పుడుపోతనామాత్యుఁ డెఱ్ఱాప్రెగడ మనుమని కాలములోని వాఁడయియుండును. ఎఱ్ఱాప్రెగడ విరచించిన హరివంశమును కృతినందిన వేమారెడ్డి ముమ్మనమఁడైన వీరభద్రారెడ్డి కాలములో శ్రీనాథ కవియుండుటచేతను, ఎఱ్ఱాప్రెగడ ముమ్మనుమని కాలములో బమ్మెర పోతరాజుండుటచేతను, శ్రీనాథ పోతరాజులేక కాలములోని వారని నిస్సంశయముగా నొక్కి వక్కాణింపనగును. మఱియు నీ కవియొక్క చమత్కృతిని గుఱించియు మహాత్మ్యముఁ గుఱించియు యాతని యాధిక్యతను గుఱించియు నిదివరకే నుడివియుంటిని. ఈతని మహాత్మ్యమును వెల్లడిచేయు కతలింకను ననేకములు కలవు కాని యవన్నియు వర్ణింప మేరలేదు. కావున యిప్పటి కీతని చారిత్రమును విరమించుచున్నాఁడ నని చెప్పె."

వీరిట్లూసుపోవుటకై విచిత్రమగు కతలను, కవుల చారిత్రములం జెప్పుకొనుచు సద్గతిని కొంతదవ్వేఁగునప్పటికి సాతాని పల్లె గ్రామమును సమీపించిరి. గ్రామమునకు వెలుపలి భాగమందు వేనవేలుగ తిన్త్రిణీతోపులును, అమలకీ తోపులును, హేమపుష్పకతోపులును, దాడిమతోపులును, అమ్రతోపులును కలవు. తోపులకు మధ్య నక్కడక్కడ గొప్పవగు కొండ శిలలు కలవు. వారలింతవఱకును గొప్పయరణ్యములనుండియు గిరుల మధ్యభాగములనుండియు నడచుచు వచ్చిరి. ఇప్పుడీ తోపులలో ప్రవేశించిరి. ఇప్పటికి సుమారపరాహ్ణము రెండు గంటల కాలమాయెను. అందుఁగల మయూరము లెల్లను తరణికిరణవారములేమి పింఛముల నిప్పి నటనిటు నడయాడుచుండెను. హరిణములు ద్వీపిగమనములో పరువు

లిసుచుండెను. ఆశోక హాములెల్లను పచ్చనియాకులతో చూపరుల కింపు ను. సంతోషమును కలిగించుచుండెను. భూజము లెల్లెడను పుష్ప, ఫల భరితములయియుండెను. ఆనాఁడు భానుఁడతి తీవ్రముగ నున్నాఁడు. కాని, తరువుల శాఖలవలన సూర్యరస్మిలోపులందంతగా లేక తోపంతయు హిమము చందంబున చల్లగా నుండెను. తోపులయందుం బ్రవేశించి కొంతదూరము వచ్చిన తదనంతరము నారాయణదాసు రంగరాజుం గాంచి యిట్లనియె.

నారాయణ:—“రంగరాజా! ఈవనము నాకుఁ భూతలస్వర్గమువలె నున్నది. ఇంతవరకును సూర్యరశ్మి తీవ్రముగా నుండుటంజేసి తాపము జెందినారము. కాని యిట్టి సూర్యరస్మి దినంబున నడచి తాపముంజెందిన మానవుని తాపమును భూతలస్వర్గంబోయన్నట్లున్న యీతోపులయందు బ్రవేసించిన తాపమునెల్లను నివారణముచేయునట్లు మీరుఁజెప్పిన పాతనామాత్యచారిత్రమును మీమృదుమధురోక్తులును, నాతాపముంబోగొట్టినవి సంతసమనెడి సాగరమున నోలలాడ్చినవి మఱియు నాకింకను మీరు చెప్పెడి కతల వినవలెనని యున్నయది. ఇక్కడికే రెండు గంటల కాలము మించినది. అరుణోదయము నుండియు మనము భుజింపలేదు. కావున త్వరితగతిని గ్రామములో కేగిన బాగుగనుండు” నని సెప్ప రంగరాజిట్లనియె.

రంగ:—నారాయణదాసుగారూ! “మీరన్నయట్లు యీతోపెంతయు సంతసము నిచ్చినది. తాపముం బోగొట్టినది. మఱియు నేమీ కోర్కె తప్పక నెరవేర్చెద. త్వరితముగ గ్రామమునకుం బోయి, నుచితరముగనుండు పూటకూళ్ళయింటఁ విడిసి భుజించి, సావకాశముగా కూర్చుందము. అప్పుడు మీకుఁ విసుగు విరామము లేక గొప్ప, శూరులయొక్కయు, కవులయొక్కయు చారిత్రములం జెప్పి మిమ్ముల సంతసమున నోల

లాడ్చఁ గలనని యెంచెద. కాని, పాపము మీరరుణోదయము నుండియు నడచిరి. తాపముఁజెంది యున్నారు. భుజించినతోడనే నిదుర వచ్చునే మో. అట్టి తరి మీకు చారిత్రలం జెప్ప బూనిన మీకు నిద్రాభంగ ముఁ జేసినవాఁడ నగుదునని భయపడుచున్నాఁడ" నని చెప్పె. అంతట నారాయణదాసు.

నారా:—రంగరాజా! "నానిద్ర కెప్పుడును భంగమని తలంపకు ము. గొప్పవారల చారిత్రములు జెప్పువాఁడుండవలయును కాని నెన్నిని శలైనను,యెన్ని దివములైనను, నిద్రాహారములులేకనాలకింపఁగలను. నా నిద్రకు మాత్రము భంగము కలిగించినవారై అరని యెన్నఁడు నెంచకుఁడు కాని మీనిదురకు భంగము కలిగించినవాఁడను నే నగుదునేమోయని మాత్రము సంశయింపవలసివచ్చినది" అన రంగరాజిట్లనియె.

రంగ:—నారాయణదాసుగారూ! "నాకును మీవలెనే నేచెప్పు దానిని యాలకించువారున్న నేను విసుగు విరామములులేక నిద్రాహార ములు మానియైనను చెప్పఁగలను." అని యిటుల సంభాషించుకొనుచు తోపులందాటి గ్రామముం బ్రవేసించి రెండు మూఁడు మలుపులందిరి గి నడచుచుండిరి.

ఇట్లు వారలాయూర నున్న శివాలయ సమీపమున కేగుసరికి, రం గరాజు భావమరిది, కృష్ణరాజను నతఁడు యెదురాయెను. అంతట కృష్ణ రాజు రంగరాజుం గాంచి యిట్లనియె.

కృష్ణ—"ఓహో! రంగరాజుగారు కాబోలు! చిరకాల దర్శనమై నది. నేటిదినమునకు కాబోలు భావమరఁదులపై దయ కలిగినది. అయి తే యిప్పుడెక్కడనుండి వచ్చుచున్నారు? ఎక్కడి కేగుచున్నారు? గృహ మునందు మనవారల కందరకును కుశలమా?"

రంగ—"భావగారూ! నేనుగ్రామమున నుండుటకే సావకాశము

లేక, యక్కడక్కడఁ దిరుగుచుంటిని. అట్టి తరి నిక్కడకు వచ్చుటకు వ్యవధి యున్నదని యెట్లు నుడువఁగలను? మఱియొకలాగున దలపఁను నే నిప్పుడు మనయూరి నుండి యే వచ్చుచున్నాను. మఱియు నీమధ్య మామగారికి జబ్బుగా నున్నదని లేఖవచ్చినది. అందుచే నే ముఖ్యముగా నెంతపనియున్నను వదలి బయలుదేరి యిక్కడకు వచ్చినాఁడను. అయితే మీరిక్కడనున్నారేమి? మామగారి యొడలెట్లున్నది? మనవారందరు నుకూడ యిక్కడనేయున్నారా? లేక క్షీర సాగరముననేయున్నారా?"

కృష్ణ—"బావగారు! ఏమి మాటలు చెప్పెదరు. ఎంతపనియున్నను కొంచెము సావకాశముఁ జేసుకొని రావలెనన్న రాలేరుకాబోలు? అంతచేటుపనికాబోలు? మజ్జనకునియొడలు స్వస్థతగనేయున్నది. నేనీయూర దివాణమునందు ప్రధానమంత్రిత్వముం జేయుచున్నాఁడను. మనవారందరును కూడ యిక్కడనేయున్నారు."

రం—"బావగారు! ఎంతపనియున్నదియు మీకేతెలియును? మనవారలందరు నిక్కడనే యున్నారను మాటను ముఖ్యముగా మీరిక్కడ ప్రధానమంత్రిత్వముఁ జేయుచున్నారను మాటను వినుట కెంతయు సంతసించుచున్నాఁడను. అయితే జీతమెంతిచ్చెదరు?"

కృష్ణ—"బావగారూ! ఎవరికెంతపనియున్నదియు నాకుఁ దెలియదా? కాని మీవంటి బావమరుదులు వచ్చినతరిఁ ననవలసిన మాటల నన్నాఁడను. కోపగించు కొనకుఁడు. నాకిప్పుడు ప్రస్తుతము నన్నూరు రూపాయల నిచ్చుచున్నారు. అయితే మీరుదయమున నెక్కడ భుజించితిరి? అందులకు రంగరాజేమియు బ్రత్యుత్తరమీయలేదు కాని నారాయణదాసుగారు, అరుణోదయమునుండియునడచుచునేయున్నామనియు, భుజింపలేదనియునుడివిరి. అంత కృష్ణరాజు రంగరాజును కాంచి యిట్లనియె.

కృష్ణ—"బావగారు! ఊరకుండెదరేల? ఇంత యెండను బడి యేల వచ్చితిరి? తమభ్యాహ్నమంతయుఁ నేదో గ్రామమునఁ విడసి భుజించి నెమ్మదిగా సాయంసంధ్యవేళయందుఁ బయలుదేరి రావలసినది. ఎన్నఁడును యిట్టి కష్టమును యెరుంగరే? త్వరితగతిని గృహమునకుఁ బోదము రండనెను.

అంతట రంగరాజు మార్గముననేయున్న యొక స్నేహితుని గృహమునకేగి వచ్చెదనని చెప్పెను. అంతట కృష్ణరాజు దాపుననేయున్న యొకభటునిఁ బిలచి, రంగరాజస్వమును నారాయణదాసుగారి యశ్వమును గృహమునకుం గొనిపోయి అశ్వాగారమందు కట్టివేయవలయుననియు యింటియందు మీామనుమడు వచ్చినాడనియు వంటను త్వరితముగా జేయవలయుననియు, నేచెప్పిన యట్లుం జెప్పుమని కబురుఁబంపె తదనంతరము కృష్ణరాజు రామరాజు నారాయణదాసు మున్నగు వారందరును రామరాజు స్నేహితుని గృహమునకేగిరి. అప్పటికి సుమారు నాలుగు గంటల కాలము కావచ్చినది.

తదనంతరము రంగరాజు మిత్రునితోడ కొంచెంతడవు ప్రశంసించి గృహమున కేగెను.

అనంతరము వారల గృహమందుండి చిరకాలమునుండి కాంచమి మితిప్రేమ గలఁదైన మాతామహి వెడలివచ్చి రంగరాజు నాలింగనముఁ జేసికొని "నాయనా! రంగరాజా! నేటికికదా నీదృష్టి నాపై మరలినద" నెను.

రంగ—"అమ్మమ్మగారూ! నాకు మీాయందుఁ జిన్ననాటనుండి యుఁగల యనురాగము మీాకెరుకయేకదా? వసితినమునుండి వాస్త్రముల నుండి క్రిందఁ దింపక సల్లారముద్దుగ పాశిపట్టి మీాయందునాకుఁ గల ప్రేమ తదితరులేరియందును లేదు. మిమ్ముల దర్శింప కుతూహలాయత్తచి

త్తుఁడనై యున్నను పాడు కాలము నాయాశలకు భంగముఁ గలిగించినది. నేటికె నను నాకు తీరికలేదు. కాని మామగారి యొడలస్వస్థతగా నున్నదని కర్ణములఁ బడినతోడనే, పనుల నెల్లఁ గట్టిపెట్టి వచ్చినాఁడ. మామగారి యొడలు స్వస్థతగానున్నదని యాలకించుట కెంతయుఁ సంతసించుచున్నాఁడ"ననెను.

అమ్మ—“నాయనా! రంగరాజా! నీవుఁ జెప్పుపలుకులు వాస్తవంబే. ఈప్రపంచమంతయుమాయ. ఏనిముసమున కేమి తటస్థమౌనో జెప్పజాలముకదా? మానవునికి సుఖములట్ల దుఃఖములును వెనువెంట వచ్చుచుండును. ప్రపంచమంతయు నొక రంగస్థలము మనమెల్లరము నటులము మనమాచరించు కృత్యముల కంత్యములేదు. నాయనా! నీవీవిషయమెఱింగినాఁడవు కాన తీరికఁజేసుకొనివచ్చి నాఁడ"వనియె.

రంగ—“అమ్మగారూ! నేనిక్కడ కరుదెంచి మిమ్ముల నందరఁ గాంచినందులకెంతయు సంతసించుచున్నాఁడఁగాని, రాకరాక వచ్చినందుల కొకపూటయైన నుండకుండగ నేగవలసివచ్చెఁగదా! అను వాక్యము మీఁకెఱింగించుట కెంతయు ఖిన్నించుచున్నాఁడ”

అమ్మ—“అయ్యో! నాయనా! రాకరాకవచ్చితివి. పది దినములపాటుండి వెళ్లెదవనుకొంటిని. ఈమాట వినుటకు నాకు గండముగా నున్నది. నాయనా! అంతపని యేమున్నది? రెండు దినములలైనను యుండేగుము”

రంగ—“మాతామహీ! నాకును మీవలెనే యభిలాషయున్నది కాని హైదరాబాదునుండి మజ్జనకులు త్వరితగతి నక్కడకు రావలయునని యాజ్ఞాపించిరి. ఇక్కడికే నేను మిక్కుటముగాలస్యముఁ జేసినాఁడ. కావున రేపరుణోదయమునకే పయనమై అధమపక్షమెల్లుండికైన నచటఁజేరఁవలెను. సాధారణముగాఁ నెంతో నవసరమగు కృత్యముండినఁ గానిమా

జనకులు మనిషిని నంపరని మీకు దెల్లంబేకదా?"

అమ్మ—"నాయనా! రంగరాజా! నీవంత త్వరితముగా తేపేయే గవలయు ననుచుంటివి కాన నేనిన్నాగవలయునని నిర్బంధించుట మంచి దికాదు. కాని జాగరూకతతో నేగవలయును. నీవెట్లుగెదువో నాకుఁ దె లియకున్నది. కానిమ్ము. పాపము నేవేళప్పుడు భుజించితివో మడిఁ గట్టుకొనుము.

రంగ—"అమ్మమ్మగారూ! నేను తిరిగి కొద్దికాలములోనే వచ్చె దలెండి. మీరు బెంగఁబెట్టుకొనకుఁడు" అని సెప్పి పడమటింటి గదిలోనికిం బోయి యఱగవస్త్రముఁ గట్టుకొని స్నాతుండై, వంట యింటియందు త నకును, జామాతలకును, భావమరుదులకును వేసిన పీటలలో నొకపీటపై నధిష్టించెను.

అమ్మ—"అమ్మా! అమ్మాయీ! మనరంగరాజు తేపటిదినమున నే వెళ్లునట. రాకరాకవచ్చినాఁడుకదా పదిదినముల పాటుండునేమోయ నుకొంటిని. వారి నాన్నగారు త్వరితగతిని రావలయునని మనిషినిఁ బంపి నారట. మనవాడికి మొగమోట మెక్కువ. కావలసినది వైచి పెరుగైన పాలైనఁబోయుము. నాయనా! రంగరాజా! కావలసినదడిగి వేయించుకొ నుము." అని రంగరాజువైపునకుఁ దిరిగి గనియె.

రంగ—"నాకు మొగమోటమేమిటి. మీరటుల నుకువ వల ద"నియె.

అమ్మ—"నాయనా! రంగరాజా! నీవు కథల జెప్పుటయం దధిక ప్రియుఁడవని నాకర్ణములఁ బడినది. భోజనమైన తదనంతరం బేదేని యొ కకథం జెప్పుము. నెమ్మదిగా భుజింపుము"

రంగ—"అమ్మమ్మగారూ! అలాగుననే మీకోర్కె నెఱవేర్చెద. కాని నేఁభోజనముఁ జేయులోన నాతోఁ నరుదెంచిన నారాయణదాసా

ములకు భోజనమిముఁడు."

అంతటాఁబిడ నారాయణదాసాదులకు భోజనమిడెను. వారలు త్వరితగతిని భుజించి, రంగరాజు వద్దకేగిరి. ఇంతలో నాఁడు వాండ్రును రంగరాజు జెప్పెడి కథల నాలకింప కుతూహలులై త్వరితగతిని భుజించిరి. రంగరాజు మున్నగు వారలందరును తలవాకిట వేసిన మంచముపైనను చదురులపైనను గూర్చుండిరి, ఇంతలో గృహమునుండి నాఁడువాండ్రను నుయుచటకు కరుదెంచిరి. మఱియు రంగరాజుగారు వచ్చిరని వినినతో డనే వారి కథల నాలకింపఁ డెందములయందు గుందుచున్న పాఱుతలు ను, మఱియు పరిసరములనున్న మఱికొందరు నచటకేతెంచిరి. వీరల నం దరఁ గాంచునప్పటికే రంగరాజాహ్లాదమనియెడి ఘనసాగరము నందీ దులాడఁ బ్రారంభించెను. అంతట రంగరాజాంధ్రకవితా పితామహాబిరు దాంకితుఁడలసాని పెద్దన్న చారిత్రము జెప్పుచు నక్కడక్కడ పద్దియముల జదువుచు వారల హృదయములరంజింపఁ బ్రారంభించె.

నవమ ప్రకరణము.

అల్లసాని పెద్దన.

ఈతని జన్మస్థానము బళ్లారి ప్రాంతములనున్న దూపాడు జిల్లాలో ని దోరాలగ్రామము. ఈతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. ఈత ని జనకుఁడు చొక్కనామాత్యుఁడు. కృష్ణదేవరాయుల యాస్థాన పండితు

లలో నగ్రగణ్యుఁడు. ఈతఁడు సుమారు ౧౫౩౫ వ సంవత్సరమువఱకు జీవించియుండెను. కృష్ణరాయలకు సలహానిచ్చుటయందే కాదు ఆతనిని సరి తోవ పెట్టుటయందే కాదీతఁడు ముఖ్యుఁడు. వానికి కుడిహస్తమువంటివాఁ డు. ఈతఁడెక్కడికైన నేగెనేని కృష్ణరాయలకు కుడిహస్తము బోయినట్లుం డెడిది. మఱియు కృష్ణరాయ లనంతరమాతని రాజ్యము తునుకలై పోవు టకు సిద్ధముగానున్నతఱి, రాజ్యమట్లు చీలిపోకుండ కాపాడినదీతఁడే. కృష్ణ రాయల మరణవార్త కటక నృపుడగు గజపతి కర్ణములఁ బడినతోడనే, రాయలు రాజ్యముపైకి దండెత్తివచ్చెను. అంతటీ సంగతి, పెద్దన విన్న వాఁడై యీక్రిందివిధమున నొక పద్దియముం జేసి చదివి, వానిని లజ్జాకరు నిఁగాజేసి సాగనంపె.

సీ. రాయరావుతు గండ రాచయేనుగువచ్చి యారట్ల
కోటఁ గోరానునాఁడు
సంపెట నరపాల సార్వభౌముఁడు వచ్చి సింహాద్రి
జయసిలఁ జేర్చునాఁడు
పెలగోలు సింహంబు పేరి ధక్కృతిఁ గంచు తి
ల్పులఁ గరులడి కొల్చునాఁడు
ఘనశర నిర్భర గండపెండర మిచ్చి కూతురా
యలకును గూర్చునాఁడు

వాడలెరుంగవో చచ్చితోయుర్విలేవో
చేరఁజాలక తలచెడి జీర్ణమైతో
కన్నడం బెట్లు చొచ్చెదు గజపతిందరి
తెలిచి నిలుకుక్క చొచ్చినతెఱఁగులోఁప.

ఈకవీశ్వరుఁడన్య కవుల వంటివాఁడుగాడు. ఇంతవఱకును గలకవు

లెల్లరును, వేదోక్త మార్గముగను, గూఢముగను, పూర్వాచార రీతిగను ప ద్దియములఁజేసిరి. అన్యభాషాపదముల నెవరును వారల పద్యములందుఁ జొప్పింపలేదు. కాని యీకవి తన పద్యములం దన్యభాషాపదముల స్వే చ్ఛగా నుపయోగించినాఁడు. ఇందులకుఁ దార్కాణముగా

మ. సమరక్షోణిని గృష్ణరాయల భుజాసాతాసిచేఁ బడ్డదు
ర్దమదోర్దండ పుళిందకోటి యవనవ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునంగాంచి శబాసహాహాహరిహరంగాఖూబుఖోడాకితే
తుముకీ బాయిల బాయిదేమలికి యందుర్మింటికిం బోవుచున్.

మఱియు నీకవిత్వము స్వకపోల కల్పనలతో గూడినది. కావున నితఁడే ప్రస్తుత గ్రంథముల వ్రాయుకవులయొక్కయు, నాతని తదనంత ర కవీశ్వరులు రచించిన గ్రంథములయందు వారలు వ్రాసిన కల్పనల కును అన్యభాషాపదముల జేర్చి పద్దియములఁ గూర్చుటకు మార్గదర్శిగా కాన్పించుచున్నాఁడు కాని యన్యభాషాపదముల మాతృభాషయందుప యోగించుట కవికి లక్షణమైన పనికాదు. ఒకవేళాతఁడుపయోగించిన ను దాని ననుసరించి తదితరులుపయోగించుటయు నుచితముకాదు. మ ఱియు నీతఁడాస్థానపండితుఁ డప్పుటయేకాక, రాజదర్శనార్థమైవచ్చిన ప్ర తీకవిని రాయలలసాని పెద్దనవద్దకే నంపి పరీక్షించునట్లాజ్ఞాపించువాఁడు. అంతట పెద్దన వారినిఁ బరీక్షించి వారల సామర్థ్యము రాయలకుఁ జెప్ప, నాతఁడు వారలకుఁ దగు బహుమానముల నిచ్చి యంపెడివాఁడు. ఇందుల కుదహరణగా, నొకనాఁడు 'రాధామాధవుఁ'డను కవి రాయలాస్థానమునకు రాగా, వాని సామర్థ్యముఁ బరీక్షింపవలయునని పెద్దన వద్దకంప, పెద్దన 'నగరు' 'తగరు' 'తొగరు' 'వగరు' అను పదములవ్రాసిప్రదేశములం దుంచి రామాయణపరముగాఁ బద్యముఁ జెప్పుమనగా నాతఁడిట్లు జెప్పె,

చ. నగరు పగాదె నింక విపినంబుల కేగుఁడు రాజ్యకాంక్షకుఁ
తగరు కుమారులారయని తల్లివగల్మి ఘూంఙ్కఁ దోపఁగాఁ
దొగరు నరత్నఁగట్టియది దోఁచకగద్గద భిన్నకంఠయై
వగరుచుచున్నఁజూచి రఘువంశవరేణ్యుఁడు తల్లికిట్లనున్.

అని యీపద్యము చదువగా కడు సంతసించి, పై పదములతో డనే పంచమవేదమన బరగు భారతపరముగాను జెప్పవలయునని కోరంగా నీద్విపద్యములం జదివి వానిని మెప్పించె.

చ. తొగరుచి కన్నుఁదోయిఁ గెంపుఁ దోఁచఁగఁ గర్ణుఁడు భీమసేనుపైఁ
దగరు ధరాధరంబు పయిఁ దాఁకిన భంగిని దాఁకినొచ్చితా
వగరుచుచున్ వెసంబరుగు వాఁడిన నచ్చటి రాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మదినాటుటఁ జేసి ధరాతలేశ్వరా.

చ. వగరు పు మాత్రమే వరుఁడు వశ్యుఁడు కాఁడు సఖసఖత్వమె
న్నగరు డవాహనుండు మునినాఁడటు డించుటయెల్లనుద్ధవా
తగరని కాక మోహపు లతాతను వైన విడంగఁ జాతుగే
తొగరుచి మోహధీశునకుఁ దోఁపఁగఁ జేయునె వీడనాడఁగన్.

ఈకవి యుభయభాషలయందును సమాన పాండిత్యము గలవాడే. ఒకనాఁడు రాయలు సభఁదీర్చి, సకల పండిత సామంతాదు లందరును తన్ను గొల్చుచుండ, నొకకవిగండ పెండేరమును సువర్ణతబుకు నందుంచి, సంస్కృతాంధ్రములందు సమముగా కవిత్వముఁ జెప్పఁగలవారు దీనిని ధరింపవలయునని పలుక, పెద్దన్న, యీక్రింది యుత్పలమాలిక నాసుధారగా జదువ, రాయలు సంతుష్ట హృదయాంతరంగుడై, మెచ్చి స్వయముగ తానే సింహాసనముఁ డిగ్గివచ్చి కవిగండ పెండేరమును వాని పాదమునఁ దొడిగె.

ఉ. పూఁతమెఱుంగులుం బసరుపూప బెడంగులుఁ జూపునట్టి వా
కైతలు జగ్గనిగ్గునన గావలెఁ గమ్మనఁ గమ్మనన్యలెన్
రాతిరియుం బవల్ మఱపురాని హొయల్ చెలియారఁ జంపు ని
ద్రాతరి తీపులం బలెను దారసిలత్వరలోఁ దలంచినన్
బాలికఁ బైకొనన్వలెను బైదలికుత్తుకలోని పల్లటీ
కూతలనన్వలెన్ సొగసు కోర్కులు రావలె నాలకించినన్
జేతికొలందిఁ గౌఁగిటను జేర్చినఁ గన్నియ చిన్నిపొన్నిమే
ల్పూఁతలచన్ను దోయివలె ముచ్చటగావలెఁ బట్టిచూచినన్
డాలొడనున్న మిన్నుల మిటారపు ముద్దుల గుమ్మకమ్మనా
వాతెఱ దొండపండువలె వాచవికావలెఁ బంటసూదనన్
గాతలదమ్మిచూలి దొరకై వసపుంజ వరాలి సిబ్బెపు
న్మైతెలియబ్బురంపు జిగి నిబ్బరపుబ్బగుగబ్బి గుబ్బ పొం
బూతలనున్న కాయ సరిపోడిమి కిన్నెరమెట్ల బంతిసం
గాతపు సన్నబంతి బయకారపుఁ గన్నడ గౌళవంతుకా
సాతతతానతానల పసందివుటాడెను గోటమీటుబల్
మ్రోతలునుం బలెన్ హారువు మొల్లముగా వలె నచ్చతెన్గులీ
రీతిగ సంస్కృతంబు పచరించిన పట్టినభారతీవధూ
టీతపనీయ గర్భనికటే భవదానన పర్వపాహితే
శ్రాతికనాటక ప్రికరభారతభారత సమ్మతప్రిభా
శీతనగాత్మజాగిరి శశేఖర శీతమయూఖరేఖికా
పాతసుధాప్రిపూర బహుభంగ ఘుమం ఘుమఘుంఘుమార్భటీ
జాతకతాళయుగ్మలయసంగతి చుంచువిపంచి కామ్యదం
గాతత శేహిత త్రిహితహాధి తదంధణుఘాణుదింధిమి
దాత్రిశన సూనుకూలపదవారకు హూద్వహహారికింకిణీ

నూతనఘుల్ఘులాచరణనూపుర ఝుణాళఝుళీమరంద సం
ఘాతవియద్ధునీచక చకద్వికచోత్పల సారసంగ్రహా
యుంతకుమారగంధవహహారి సుగంధవిలాసయుక్తమై
చేతము చల్లఁజేయనలె జల్లనఁ జల్లవలెన్మనోహర
ద్యోతకగోస్తనీఫలమధుద్రవగోఘృతపాయసప్రసా
రాతిరసప్రసారరుచితప్రతిమంబుగ సారెసారెకున్.

ఈకవి తదితరకవులవలె రాజాజ్ఞలకు లోబడి రాజాజ్ఞాపించినపు డెల్లను పద్యములం జెప్పక తనయిచ్చవొప్పిన జెప్పెడివాఁడు. ఇందులకు తార్కాణము నొకనాఁడు కృతి చెప్పుమని ప్రార్థింపగా కృతిఁ జెప్పక యీక్రింది పద్యముఁ జదివెను.

చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడెమాత్మకింపయిన భోజనముయ్యెలమంచమొప్పు త
ప్పరయు రసజ్ఞులూహ తెలియంగల లేఖకపాఠకోత్తముల్
దొరికినఁ గాక యూరక కృతుల్రచియింపుమటన్న శక్యమే?

మఱియు నీతని కవిత్వంబతిమనోహరమై పదలాలిత్యము కలదై, సంస్కృతాంధ్ర భాషాపదభూయిష్ఠంబై దనరారుచుండు. ఈతని కవిత్వమునందలి మృదుమధురజటిలత్వములఁ బట్టియే "అల్లసానివాని యల్లిక బిగియును" అను ప్రసిద్ధి వచ్చినది. ఈతఁడు హరికథాసారము మనుచరిత్రమున్నగు గ్రంథముల రచించినాఁడు. వీటిలోని కెల్ల మనుచరిత్రయే ప్రసిద్ధి కెక్కినది. పెద్దన్న మార్కండేయపురాణములో నుండి స్వారోచిషమను సంభవకథనుం దీసికొని స్వకల్పనచే కథం బెంచి స్వారోచిషమనుచరిత్రమను పేర రచించినాఁడు. ఈతఁడే నిట్లు రచించుటలో నాది, దీని ననుసరించియే యీతనికాంధ్రకవితాపితామహుఁడన్న బిరుదనామధేయము

సార్థకమైనది. మఱియు నీతనికి కవిత్వముఁ జేయురీతి బాగుగా దెలియును. దీనినిఁ గూర్చియే యొకపద్దియముఁ జెప్పియున్నాఁడు.

చ. ఘనతరఘూర్జరీకుచయుగకి్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుఁగవలీల గూఢతయుఁ జాటు తనంబును లేకయుండఁ జె
ప్పినయదెపోకవిత్వమనిపించు నగించుటగాక యుండినన్.

ఈకవిని రాయలు మిక్కుటముగా పే్రమించెడివాఁడనియిదివఱకే నుడివియుంటినిగదా! అట్లే పెద్దన్నయు రాయల నధికపీ్రతితోడఁ జూడెడివాఁడు. పెద్దన్న రాయలొద్ద నున్నంతవఱకు రాయలకు కన్నులపై కుంతముగను, రాయలు పెద్దన్నయొద్ద నున్నంతవఱకు పెద్దన్నకు నేత్రవైకుంఠముగను యుండెడిది. వారిరువురు గొప్పసంగాతకాండ్రు రాయలు పెద్దన్నయవిన శిరస్సుపైఁ బెట్టుకొనెడివాఁడు. కాని రాయలు పెద్దన్నకన్నను ముందరగనే మృతినొందెను. ఆవార్త పెద్దన్న విని, సర్వసద్గుణాలంకారుఁడును, ఆంధ్రభాషాభిలాషుఁడును, ఆంధ్రభాషాభివృద్ధుఁడును, కవిభక్తతత్పరుఁడును, దైవభక్తతత్పరుఁడును, దుర్మార్గులకు గర్భశతు్రవును, వానిపి్రయమితు్రఁడునునగు రాయలు పరలోకవాసుఁడగుటయు, తాను జీవచ్ఛవంబగుచు నిలిచియుండుటయు నమావాస్య దినరాతు్రలయందంధుని చందంబున నున్నాడనని యీక్రిందిపద్యముం జెప్పి, దుఃఖసాగరమునం గొట్టుకపోయె.

సీ. ఎదురైనచోఁ దనమదకరీంద్రము డిగ్గి
కేలూఁతయొసఁగి యెక్కించుకొనియె
మనుచరిత్రంబందుకొనువేళఁ బురమేఁగఁ
బల్లకి తనకేలఁ బట్టి యెత్తె

విరుదైన కవిగండ పెండేరమున కీవె
తగుదని తానె పాదమునఁ దొడిగెఁ
గోకట గ్రామాద్యనేకాగ్రహారము
లడిగిన సీమలయందు నిచ్చె
నాంధ్రకవితాపితామహాయల్లసాని
పెద్దన కవీంద్రయని నన్ను బిలుచునట్టి
కృష్ణరాయలతో దివికేఁగలేక
బ్రతికియుండితి జీవచ్ఛవంబనగుచు.

అని యీపద్యమును రంగరాజు చదివి వారల కర్థంబుఁ దేటగాఁ జెప్పి, వారెల్లరును మిక్కుటమగు రేయి యగుటఁజేతను జ్యేష్ఠాదేవి వారల నాశ్రయించుటచేతను కునికిపాటులు పడుచుండ వారలందరను మేల్కొలిపి వినోదంబుగాక కథ నీసందర్భమునం జెప్పిన వీరల నిదుర వోవునని జెప్పి రామలింగని గుఱించిన కథయొకటిఁ జెప్పె.

అల్లసానిపెద్దన్న యొకదినమున

‡ క. కలనాటిధనములక్కఱ | గలనాటికిఁ దాఁచ గమలగర్భునివశమా?
నెలనడిమినాఁటి వెన్నెల | యలవడునే గాదెఁ బోయ నమవసనిసికిన్.?

ఈవిధముగా జదువ నంద 'మవసనిసి' యనునది తప్పుప్రయోగ మని భ్రమపడి వానినాక్షేపించుచు నిట్లనియొక పద్దియముం జదివెను.

క. ఎమిలిని సెపితివి కపితము
బ్రమపడి వెఱిపుచ్చకాయవడిఁ దిని సెపితో
యుమెతకాయ దిని సెపితో
యమవసనిసియన్నమాట యలనసి పెదనా.

‡ ఈకథ కేవలము జనవారలెవ్వరో కల్పించినదే కాని వాస్తవము కాదు. ఏలనన రామలింగకవియు, పెద్దన్నయు నొక్క కాలములోనివారు కారు.

ఈపద్దియము రంగరాజు చదివినతోడనే వారలెల్లరును నవ్వి ,,ఆహా! తెనాలి రామకృష్ణు డెంతకైనను తగును. ఎక్కడకు బోయినా సయితానివలె వాఁడేకదా" యని యొకరితో నొకరనుకొని, కథ ముగిసినదని చెప్పిన తోడనే వారలెల్లరును వారల గృహముల కేగిరి. రంగరాజును పడమటింటి గదిలో దనకొఱకై వేచియున్న పాన్పుపై శయనించెను. ఆనాఁడు వారలు గాఢముగా నిద్రించిరి.

(అతఁడట్లు ,,అమవసనిసి" యను పదప్రయోగమును తప్పుగా భావించినను, యదివాస్తవముగా నొప్పుగాని తప్పుగాదు. రామలింగకవట్లుగా నధిక్షేపించియుండడు కాని యిది యాతని హాస్యగుణమున్ను వెల్లడిచేయు మనవారలు కల్పించిరేమో యని మాత్రము సంశయింపవలసియున్నది.)

ఇంతలో కొంతకాలమగుసరికి తొలికోడికూసెను. వారలమ్మమ్మగారు వెంటనే లేచి రంగరాజు మున్నగువారలకు పెందలకడనే భోజనము బెట్టి పంపవలెనని వంటనొండెను. ఇంతలో మలికోడికూసెను. అంతట రంగరాజాదులను పడకనుండిలేపి, పెందలకడ నేగవలయునంటిరి కాన, త్వరితముగా ప్రాతఃకాలోచిత కార్యముల నాచరింపుఁడనెను. అంతట వారలాచరించిరి. ఇంతలో రంగరాజునకు వంటయింటను, మిగిలినవారలకు వసారాయందును భోజనమిడియెను. ఈమధ్యకాలములో కొంతయన్నమును మార్గమునందా నాటికి సరిపోవునటుల నొక ఘనమోదుగాకునందు వడ్డించి గురుగుకట్టి యింతదధిఁబోసి నావకాయి యూరగాయి ముక్కలనొక నైవునంబెట్టి యాకుంజుట్టపెట్టి యొక కుచేలమున మూటగట్టెను. త్వరితగతిని రంగరాజాదులు పరిశుభ్రముగా కమ్మని యచ్చావు నెయ్యితోడను, ఉరలగడ్డల కూరతోడను, కమ్మనైన మీగడపెరుగుతోడను భుజంచిలేచిరి. ఇంతలోఁ నమ్మమ్మగారు గదులలోనికిఁ బోయి మామలను, అత్తలను మున్నగువారల నెల్లను రంగరాజు వెళ్లుచున్నాఁడు

లెమ్మని వారల పాన్పులనుండి లేవఁగొట్టెను. ఇంతలో రంగరాజు మున్న గు వారలు వస్త్రములం ధరించిరి. వారి గృహసేవకుఁ డొకఁడశ్వాగార మునకుఁ బోయి రంగరాజుయొక్కయు, నారాయణదాసుయొక్కయు తు రగములం గొనివచ్చె. అంతట రంగరాజు దేముని పెట్టెవద్దకేగి నమస్కరించి వచ్చి యశ్వముపై నారోహించి, అమ్మమ్మగారు మున్నగువారల యొద్ద సెలవుం దీసుకొనియె.

అప్పుడమ్మమ్మమ్మగారు నారాయణదాసుగారి వైపుం దిరిగి “నా యనా! నారాయణదాసుగారు! మాపిల్లవానినొల్లుకొనిపోవుదురో కుఱ్ఱ వాఁడు ఏమియు దెలియదు. ఆదైవము మిమ్ముల మావానికి సాహాసము గా గూర్చినాఁడు. మిమ్ముల గుఱించి మావాఁడు మాతో వారట్టివారు వీరిట్టివారని బహువిధయులఁ జెప్పినాఁడ”ని చెప్పి రంగరాజు సేవకునితో “నీవు వాఁడు చెప్పినచొప్పున యాచరింపుము. వానితోడనేయుండుము. జాగ్రత్తయని” చెప్పి రంగరాజు వైపు మరలి, నాయనా! రంగరాజా! జాగ్రత్తగా నేగుము. కాలము మంచిదికాదు. నీవక్కడచేరినతోడనే నీవు సుఖముగా చేరినట్లొక లేఖను వ్రాయుము. మరల వచ్చునపుడు యిక్క డకు తప్పకరమ్ము. పాపము నారాయణదాసుగారొకరు నీకు మునివలె త టస్థమయినారు.

నారా—అవ్వగారూ! మీరునన్నంతగా పొగడవలదు. నేచేసిన దేమియులేదు. మాకువారు మేము వానికి సహవాసముగా నూసుపోవుట కై కథలు మున్నగువాటినిఁ జెప్పుకొనుచు వెళ్ళుదుము. మీవానికి వ చ్చిన భయమేమియు లేదని”యె.

అమ్మ—“నాయనా! అదియే గొప్పయుపకారము. ఇక్కడకే ప్రొద్దెక్కినది. జాగ్రత్తగఁ నేగుఁడు.

రంగ—అమ్మమ్మగారూ! మామగారు! అత్తగారు వెళ్ళి వచ్చెదను సెలవిండు."

అందరు—"నాయనా! మంచిది. వెళ్లినతోడనే నీవు సుఖముగా చేరినట్లు మాకొక ప్రత్యుత్తరము వ్రాయుము."

అని చెప్పి మామగారు రంగరాజాదుల పురబాహ్యప్రదేశము వఱకును సాగనంపి గృహమునకుఁ దిరిగరుదెంచెను.

## దశమ ప్రకరణము.

అంతట రంగరాజు, నారాయణదాసుగారు మున్నగు వారలందరును, సంతసమునమాటలఁ జెప్పుకొనుచు నృపద్ధతిని నడవసాగిరి. వారలేగెడి ప్రదేశము నిర్మానుష్యమై, యెల్లెడ కాంచినను కుధరములకును, వనమృగములకును నిధియై దనరారుచుండు. అది మరుప్రదేశము. అక్కడక్కడ కొన్ని వాగులున్నను, వానలులేమి జలములేక యిసుక పఱ్ఱలై యున్నవి. అంతకంత కహస్కరమయూఖవారము హెచ్చఁజొచ్చెను. వారలకు తాపము మెండాయెను. కాన వారలతి దాహపీడితులై కంఠము దడుపుకొనజలము కానరాక యెటులో పరిసరముననే యున్నయూరు జేరవలయునని విసవిస నడువసాగిరి. ఇంకను గ్రామమువచ్చుటకొక గవ్యూతిదవ్వుగలదు. ఆనాఁడు గాలుపతి మెండుగానుండెను. భానుఁడు బాణముల చందంబు

నఁ దనమయూఖముల నద్రిశిలనంపె. కాని సరణిని, వారలలో నొకఁడు మోహనుఁడను వాఁడువడ గొట్టి వాయిగిరిత్రోఁసింగూలెను. అప్పటికిస్సు మారపరాహ్ణము రెండు గంటల కాలమైనది.

ప్రపంచమందు దయోపనిధియు, నిర్వికారుఁడును, ప్రహ్లాదప్రియుఁడును పారావారావిహార గంభీరుఁడును, మానిత్యయి సారమణిమయురుఁడును, వారణదుఃఖ నివారణ శుభకరుఁడును, మందరగిరి ధరమహీనిచారుఁడును, కారుణ్యాభయదాన హస్తవరదకాకుస్థ వంశోద్భవ దారిద్ర్యాంధతమిస్రతాసారణుఁడును నగాభగవానుఁడు రక్షబిరుదాంకితుఁడు కాన, నావత్తెనెడి మహాసాగరమునం బడి యీదలేక మునుఁగుచు తేలుచు చావక యుక్కిరి బిక్కిరౌచున్న వారల నావి జేర్పకఁ మానడు. ఏదయో యొక మార్గముఁ జూపును. ఆదయామయుని నమ్మిన వారల కేమియు కొరతలులేవు. దుఃఖములు లేవు. పాపక్రోధలోభ మోహమదమాత్సర్యములకు కార్చిచ్చువంటిది. వాటినెల్ల నిముసములో ధ్వంసముఁ జేయును.

రంగరాజాదులు మోహనుఁడు ధరఁగూలిన తోడనే వారలెల్లరు భయపడి వానివద్ద కరుదెంచి యేమి కావలయునని యడుగ, నోరాడక 'మంచి' యని నెమ్మదిగా బలికెను. అంతట రంగరాజొక పాత్రను దీసుకొని జలమును వెదకుటకై బయలు వెడలెను. కాని కాంతారమంతయు జెడతిరిగినను, వాని కాళ్ళు నొప్పి తక్క, జలమొందుపు గానరాదాయె. అంతట దుఃఖపీడితుఁడై, అన్నిటికిని దైవమే యున్నాఁడని వానిపై భారము వైచి తిరిగి జలము దొరకమి వచ్చుచుండెను. అతని కనేకదుఃఖములు కలవు. జలమునకు వచ్చి వెదక జలము కానకపోవుటయు, నాతఁడాస్థలమందెట్లున్నాఁడో యనియు, వసాస్త్రములు మిక్కుటముగా నుండుటం జేసి మార్గ మెక్కడ తప్పుదునోయనియు, నీతురీయ దుఃఖముల నొందమునఁ గలవాడై, తిరిగరుదెంచుచుండ సకల పక్షివితతులకు నాకరమైన

యొక భూరుహము క్రిందుగా నేగుట తటస్థమాయెను. ఆతఁడా భూరుహము క్రిందినుండేగ కిచకిచ ధ్వనులం జేయుచు వివిధ వర్ణములతోఁగూడి గానముఁ జేయుచున్న పులుగులఁ జూడ శిరమునుపై కెత్తి చూచెను. అంతటాతఁడు దైవవశమున నాతరువున కీశాన్యముగానున్న శాఖనొక తేనెపట్టుఁగాంచెను. అంతటాతని మనము కొంతవఱకు గట్టిపడెను. ఆతఁడు హస్తమునఁ గల పాత్రను ధరపై నునిచి పైనున్న యోణీని సమును నకుఁ జుట్టబెట్టి, బహుమలపై నా తేనెపట్టు నాశ్రయించియున్న మధుమక్షికలం దోలివేసి, వృక్షంబెక్కి, తేనెపట్టుఁదీసి, వృక్షముండిగ్గి, బహుజాగరూకతతో మధువును, పాత్రమునం బిండి, హస్తమునంగొని, మోహానాదులున్న స్థలమునకు వేవేగం జని ప్రాణములు కోలుపోవుటకు సిద్ధముగానున్న వాని వాయియందుఁ బోసి కంఠముఁ గడిపి సజీవునిజేసె. అంతటాతఁడును మిగిలినవార లందరును రంగరాజాచరించిన కృత్యమున కచ్చెరువంది వాని ననేకవిధములఁ శ్లాఘించిరి. మోహానుఁడు వడకొట్టి పడిపోవుటంజేసి, తెప్పరిల్లి లేచిన తదనంతరంబ శ్రమఁదీర్చుకొనుటకై రంగరాజు తనయశ్వముపై గూర్చుండఁబెట్టి తాను సద్ధతిని నడచుచుఁ జనియె.

మానవుని కేసమయమున కేది వాటిల్లునో విధివ్రాసినవ్రాతయెట్లున్నదో యెవరికిని దెలియదు. భవిష్యత్తును జెప్పుటన్నిటికంటెను కష్టసాధ్యము. విధి లిఖించిన లిఖితమును తప్పింప విధికైన తరముకాదు. కావున నీ వేదవాక్కులన్నిటిని రంగరాజు హృదయమునఁ బెట్టుకొని, కొంతతడవు దుఃఖించి రానున్న కష్టములురాక మానవు; దుఃఖించిన ఫలము లేదు; దుఃఖించిన మనకష్టములు పోజాలవు. ఇదంతయు సృష్టివైచిత్రి ముదక్క యన్యముకాదు. ఎన్ని సమములుప్రాప్తించినను, సుఖసముద్రమునఁ మునిగియున్నను మనహృదయమా భగవానునిపైనున్న యీ దుఃఖము

లెల్ల నశించును. కానరావు.

వారిలు మార్గమునం బడి నడచి నడచి మొట్టకేలకు భానాస్తమ యసమయమునకు, సుమారు నాలుగున్నర గంటలకాలమునకు కృష్ణవేణికి వామనభాగమున నున్న తాడేపల్లియను గ్రామముఁ జేరిరి. వారలూరవిడియక కృష్ణవేణి గట్టుపై విడసిరి. అంతట వారలు గృహమునుండి కొనివచ్చిన, దధీయన్నమును నచట మూటనిప్పి, అందరును మాటలఁ జెప్పుకొనుచు పుష్కలముగా భుజించి, పావనంబగు కృష్ణవేణిలోని జలమును దాగ్రివిరి. వారల ప్రాణములు చల్లపడియె.

ఆనాఁడు భానాస్తమయ సమయమున బహుచల్లగా నుండెను. వారలును సంతుష్టహృదయాంతరంగులై యుండిరి. దానంజేసి వారలెల్లరును తిరిగి, యూసుపోపుటకై సరసల్లాపములఁ జేసుకొనుచు, నక్కడనుండియు వారిల గ్రామమునకు సాధారణముగా బహుదవ్వుపోవుమార్గము కృష్ణవేణి కట్టయే యాటంజేసి వారలందరును తమయశ్వముల పైనారోహించియు తురగములులేని వారలు కాలి నడకను పయనమైరి.

వారలేగునట్టి బాట సరియైనదికాదు. వారలేకరీతిగ కట్టపై నేగినను తల్లిబహుకానన మధ్యములనుండి యుగిరులమధ్యనుండియు ప్రవహించుటంజేసి గట్టుపై నేగుటయు కష్టతరంబె. మఱియు రాత్రిలు తమిశ్రి పనిశలు. కాని వారలందరును బహు సంతసమున మాటలను కథలను జెప్పుకొనుచు మార్గమందున్న రాళ్ళను వేటికిని లక్ష్యముఁజేయ కేగుచుండిరి.

ఇట్లు కొంత దవ్వేగుసరికి వారలొక మహారణ్యమునం బ్రవేసించిరి. ఆయరణ్యంబు చిరకాలమునుండియుఁ బెరుగుచు బహుదవ్వు వ్యాపించియున్న వృక్షలతుల కాకరమైయుండెను. అనేకములగు ఫణులకాకరమై యుండెను. మఱియునాఁడు స్వతసిద్ధముగా చీకటి యవుటయేగాక

తమిస్రమునకు, దట్టమగు పత్రములు శాఖలం వ్రేలుచు, ద్విభాగము లనున్న వృక్షశాఖలు కలసి వచ్చు కొంత వెలుగునైనను చొరనీయ కుండగ తోడయ్యెను. కావున నామార్గ మతికఠినమై నడువ బాట కానరాదయ్యె. కాని కొంత దవ్వేగునరి కేప్రదేశమునుండియో వెలుతురు కాన్పించెను. అందుచే వారలు సమీపముననే యేదోయొక పల్లియ యున్నదని తలచి, త్వరితగతి నాపల్లియ నారేయిఁ జేర విసవిస నడుచుచుండిరి. కాని వారలేగిన కొలదిని వెలుతురు కాన్పింపదాయె. ఇట్లు కొంత దవ్వేగునప్పటి కందొకని కాలికి మృద్ఘటము తగిలెను. అంతటాతని గుండియలు జల్లని 'నాయనో! అబ్బో! కాలికేదియో శోకినది చూడుడు. పరీక్షింపుడని' బొబ్బలిడెను. అంతట రంగరాజాదు లశ్వములం దిగి యక్కడికేతెంచి పరీక్షింప, యదొక మృద్ఘటముకాని, అన్యముకాదని సెప్పి భయపడవలదని చెప్పి వానివీపునఁ జరచి మరల ప్రయాణము సాగించిరి.

వారలందరును తిరిగినడచుచుండ, మోహనుని కాలికొక కళేబరచందంబునఁ ధరఁగూలిన నొక మనుష్యుని శరీరము సోకెను. అంతటాతఁడది వాస్తవముగా మృతకళేబరమని భయపడి, జంకి, బొబ్బలిడసాగెను.

అంతట రంగరాజాదులా స్థలమున కరుదెంచి, యొక నిప్పు పుడకను వెలిగించి పరీక్షింపగా నది శవముకాదనియు, సజీవుఁడై కొలదివాసరములనుండి భుజింపమి క్షుత్పీడితుఁడై ధర నటు నిటు పొరలియాడుచుండెననియుఁ దేటయయ్యె. అప్పుడు వారలు వాని ముఖమును చక్కగా పరిశీలించి, ముందుగ పలుకరించిన పలుకడని యొఱఁగి చిన్న పాత్రము నొకదాననిఁ దీసికొని, కృష్ణవేణికిఁబోయి, జలముఁ గొనివచ్చి, వానికిచ్చి త్రావించి లేపి కూర్చుండబెట్టి, తాముభుజింపగ శేషించిన 'దధ్యన్న'మును పెట్టిరి. అంతటాతఁడు తెలివొందినవాడై పునర్జీవితుఁడయ్యె. అంతటాతఁడు తన ముంగడనున్న వారలఁ గాంచి ట్లనియె.

“నాయనలారా! పరోపకారులారా! నాయుదరమునఁ బాలుపోసితిరి. పునర్జీవితునిఁ జేసితిరి. దయామయుఁడగా భగవానుఁడు మిమ్ముల్లనిటకుఁ బంపె. మీరుదైవమువలె నరుదెంచితిరి. నాభార్యను విధవావస్థనుండి రక్షించితిరి. నాయనలారా! విధవావస్థ ననుభవించుట కంటె సకలమును విడనాడి, యేకాకియై సాగర మధ్యమున వసించుటయే సౌఖ్యకరము విధవావస్థ కంటె నెక్కుడగు దుఃఖసాగరమొండులేదు. ఇట్టి దుఃఖసాగరమునుండి గట్టున జేర్చిరి. మీవంటి పుణ్యాత్ముల నిక్కాలమునఁ గానను. తండ్రులారా! మీరెవరు? మీరెచటి కేగుచుంటిరో నాకు సెలవిండని సాదరగా బలికెను.

అంతట రంగరాజు తనవృత్తాంతమంతయును సావధానముగా వినిపించెను. రంగరాజును మిగిలినవారలును, వీని వృత్తాంతమును విన కుతూహలాయత్త చిత్తులై యుండి యాతనిని వృత్తాంతంబుఁ జెప్పవలయుననియడుగ శంకించి, యెట్టకేల కాతనిని వృత్తాంతంబుఁ జెప్పఁ బ్రార్థించిరి. అంతడాతఁ డిట్లు జెప్ప బ్రారంభించెను.

“నాయనా! రంగరాజా! నీవృత్తాంతము నావీనుల విందు గొలిపెనది. సత్కులజాతుఁడవు కానయింతటి ధర్మాత్ముఁడవైతివి. నీచకులమునజన్మించినవానికిధర్మగుణములుంట దుర్లభంబు. రత్నములు రత్నగనిలోదొరకుగాని, గాజుగనిలో దొరకునే? లేక రత్నగనిలోగులకరాళ్ళు పుట్టునే? కర్మవశమున పుట్టినను రత్నములకు సాటియౌనే? ‘యథాపిత తథాపుత్రి’ యను నదిసర్వసాధారణముగా లోకమందు, జనకుడెట్టివాఁడగునో, పుత్రుడునట్టి వాఁడే యగును. తండ్రి సన్మార్గుఁడైన, పుత్రుఁడును సన్మార్గుడగు తండ్రి దుర్మార్గుఁడైన, వానికి జనించినవాఁడు నట్టివాఁడే యగును. విత్తొకటైయున వృక్షంబొకటిగాదుకదా? దుర్గుణు లనేకులుండుటకంటె సుపుత్రుఁ డొక్కఁడుచాలు. వేయియడవిపుష్పముల కంటె నొక్క హే

మపుష్పముచాలు. వేయువిద్యలయం దర్ధజ్ఞానమును గ్రహించుటకంటె. నొక్కవిద్యయందు పరిపూర్ణ పాండిత్యమును గ్రహించుట వేయి దుష్కృతు లాచరించుటకంటె, నొక్కసత్కృతి సలుపుట మంచిది. కావున రంగరాజా! అన్నివిధముల నీవు సద్గుణుఁడవు. గుణరత్నాకరుఁడవు. నీ జననీజనకుల గర్భంబు చల్లనైనది. నీజనకుఁడు ఘనుఁడనియు, పరోపకారపారాయణుఁడనియు విందు. కావున, నాసవిస్తరంబెల్ల నీకు సవిస్తరంబుగా వినిపించితినేని, నాకు మేలుఁ జేకూరునని తలఁచెద" నని తనవృత్తాంతముఁ జెప్ప ప్రారంభించె.

"రంగరాజా! నా నివాసస్థలం బా విశ్వేశ్వరుం డుండునగరము. నానామధేయంబు కార్తాంతి. పరభీకరుఁడు. నాకు జ్యోతిష్యముఁ జెప్పుటయందు ప్రవీణతకలదు. జ్యోతిష్యము జెప్పుటయందు నాయంతటి సమర్థుఁడులేడని బ్రహ్మావంగాదివిషయములయందుఁ ఖ్యాతిగాంచినాఁడ. నా యపారఖ్యాతిని కళింగపార్థివుఁడగు బుక్కరాయని కర్ణములఁబడి, సంతసించి, నన్ను తనయాస్థానమునం దగ్రజ్యోతిష్యునిగా నొనరింప డెందమునఁదలంచి, సందేశహారునొక్కని నాయొద్దకంపె. అంతట నేనును సంతుష్టహృదయాంతరంగుఁడనై, సకుటుంబసహితముగా కళింగరాట్ నిగమమున కరుదెంచితిని. అంతడాతఁడు నాకుఁ దగు మర్యాదలఁజేసి, యూరిబయలనున్న యారామమునఁగల యొక రమణీయసౌధమునం బ్రవేశపెట్టె. ఆనాటనుండియు నన్ను కళింగరాటుఁ డతిప్రేమతో మిగిలినవారలకంటె నెక్కుడుగజూచుచు, గురుపూజ సలుపుచుండె. ప్రపంచమంతయు మాయకదా? అందిది కలియుగము. కలియనెడి ద్వియాక్షరములయందే గొప్పయర్థంబుకలదు. అట్టితరి ప్రజలెట్టివారలై యుందురో యెఱికని తెల్లంబే. అందు ముఖ్యముగా, ప్రపంచమునందు మనకంటె నెవ్వఁడేని నెక్కుడుగా నుండినయెడ, వానినెట్లయినను వంచించి

వానియొద్దనున్న సొత్తును లాగుటకో, లేక యాతఁడుకొలుచుచున్న వాని
కిని, వీనికిని యేవియో కొండెములఁజెప్పి తగవులఁబెట్టి వారల విడఁ గొ
ట్టుటకో యీమాయప్రజలు ప్రయత్నించుచుందురుకదా? ఎల్లెడకాంచి
న యీరావ్యభువులేకదా? ఎల్లెడచూచిన నన్యులతోడ కొండెములఁ
జెప్పి వారలకు తగవులుపెట్టి పైనికాంచుచు సంతసించువారలేకదా?
ఆహా! ఈప్రపంచమాయ యేమని నుడువవచ్చును. కావున, రంగరా
జా! యీసంగతులెల్లను నీకుఁ దెలిసియేయుండును. బుక్కరాయఁడు
నన్ను ప్రేమించుటమొదలుగా, నాకొలువునందున్న వైదికమార్గ ప్రవ
ర్తకులగు కొందరు నాపై నృపునితోడఁ గొండెముల, ప్రియవచనముల
చేఁ జెప్పి, వానిఁ మెప్పించి, మా యిరువురస్నేహమును బాపి, నన్నును,
నాభార్యాపుత్రులను పురమునుండి తరుమ యత్నించిరి. పాపము, వార
లాపుణ్యమును వెంటనే కట్టుకొనిరి. వారలవాంఛలెల్ల నీడేరె. నే ను
నృపునితోడ ననేక ప్రియవచనములఁజెప్పి చెడగరపుహాలనుండి మరల్ప
యత్నించితిని. కాని వారలు నూరిపోసినపలుకులపై నాప్రియవచనము
లు చెవినిబెట్టక, నన్ను పురమునుండి వెడలఁనడిపినాఁడు. నా పండువంటి
సంసారమును కూల్చినాఁడు. భార్యాపుత్రులనుండి యెడబాపినాఁడు.
కఠినుఁడు. దుర్మార్గుఁడు. నీచుఁడు. అన్యులవాక్కులందు నమ్మికనుంచి
ప్రియకాండ్రఁ బారదోలువాఁడు. అన్నముఁబెట్టి పడగొట్టినాఁడు. అవు
ను; ,, విపరీతకాలే వినాశబుద్ధిః '' అన్నట్లు పోగాలము దాపించినవార
లిట్టిపనులఁ జేయుదురు. రంగరాజా! తడవులనుండివసించుచున్న వార
ణాశీనగరమునం దయినను వసింపక, బుద్ధిహీనుఁడనై, ఈచెడగరపువాని
వద్దకువచ్చి, పరిచేతనైన నొక్కపలుకైన ననిపించుకొనని నే నీ నీచుని
చే, దుర్మదునిచే, కండకావరముచే కొవ్వియున్న వీనిచే మాటల ననిపిం
చుకొని, భార్యాపుత్రుల నెడబాసి యీయడవుల సంచరించుచుంటి

కదా ! హా లలనామణీ ! హా ప్రియసీ ! హా నాచిన్నికుమారా ! ముద్దు బాలకా ! యని భార్యాదులఁ జ్ఞప్తికి దెచ్చుకొని వెక్కి వెక్కి యేడ్వ సాగెను.

అంతట రంగరాజు వానిఁ సమీపించి, "కార్తాంతిపరభీకరా !" దుఃఖింపకుము ; దుఃఖింపకుము ; విధిని దప్పింప నేరికిశక్యము. విధికుమరికకే యంతటి దుస్థితి తటస్థింప మన మెంతటివారము. పూర్వజన్మఫలిత మనుభవింపక తీరదు. దానికై వగచిన వ్యర్థము. వగచి దుఃఖముల నెడబాపుకొనఁజాలము కదా ? దానికై వగచిన, చీకటికి మేఘములు తోడైనట్లు, మనదుఃఖమునకుఁ దోడై, దుఃఖము మెండగును. వగవ పనిలేదు. "ధైర్యం సర్వత్ర సాధనం" అన్న ట్లెన్నిదుఃఖములు వచ్చినను. వెరువక ధైర్యముఁ బూనియుండవలెను. సౌఖ్యముగా నున్నతరి క్రిందునుమీదును గానక కిరలిపడరాదు. సౌఖ్యలేమిని విచారింపరాదు. మానవుఁడు సర్వదా సుఖియవుట దుర్లభము. ఏలనన, సౌఖ్యముల నంటియే దుఃఖములును వెనువెంట నంటి వచ్చుచుండును. దుఃఖ మనుభవించువానికి సౌఖ్యము వెంటనే వచ్చు ; గాన, దుఃఖముఁ గట్టిపెట్టి తదనంతరకతను నుడువుము."

అంత టాతఁడు మరల తనకతఁ జెప్ప బ్రారంభించెః—

"రంగరాజా ! తదనంతరము భార్యాపుత్రుల విడనాడి, యేమియుఁ దోచక కాననములం బడి, దుఃఖించుచు, పూర్వము వారణావత సౌఖ్యమును, యిప్పటి దుఃఖములను జ్ఞప్తికిఁ దెచ్చుకొని, సంతసించుచు, దుఃఖించుచు, శపథంబులఁ జేయుచు వచ్చుచుంటి. అప్పుడు "బుక్కరాజా ! నే నిన్ను రాజ్యహీనునిగా జేసి, నావలె భార్యాపుత్రాదులనుండి యెడబాపి కాననముల చరియింపఁజేసి, నాపై కొండెములఁ జెప్పిన ఖిపుల పేలముల వేసినయట్ల పాట్లఁ బెట్టకున్న నానామము కార్తాంతి

పరభీకరుఁడు గాడ" ని శపథముం బట్టియున్నాఁడు. మహానుభావా! ఈశపథము నెఱవేర్పఁగోరెద. ఇటుల శపథంబులఁ బట్టుచు, నామనంబున సంతోషకరమగునాలోచనలు తగిలిన సంతసించుచు, లేకున్న దుఃఖించుచు, కాననములం బడి యెట్టకేల కీకాననమునం బడి, సుమారారుదివసము లకు ముందు, భానాస్తమయమైన తదనంతరంబ ముందరపల్లియ త్వరిత గతి చేరవలె నని విసవిస నడచుచు, నాలో నే వితర్కించుకొనుచు నేగు చుండ నేకిరాతుఁడో నావెనువెంటనరుదెంచి, పెద్దబడియచే నామూర్ధము నం బెట్టె. అంత పరశువు వేటునంబడిన తరువుచందంబునఁ గిజగిజ తన్ను కొంచు గుభాలున క్షోణిం గూలితి. నాఁడుగా నిక్కడ నే పడియుంటిని. పానాహారంబులు లేవు. మృతినొందుటకు సిద్ధంబుగ నుంటి. దైవమువలె మీరును, వీరలును వచ్చి పునర్జీవితుం జేసితి రని సెప్పి తనకథను ముగించెను.

రంగ—అంతట రంగరాజు వానివైపుఁ జూచి, మహానుభావా! కార్తాంతిపరభీకరా! మీడెందమునఁ గల వాంఛలను, శపథంబులను నెఱ వేర్పఁగలవాఁడ. మనమున చింత మానుఁడు. ఇక్కడికే నడిరేయి యైనది. శీఘ్రగమనమున దాపుననున్న పురమున కేగి, నేటి కాయూర శయనిం తము. వఱువాతనే, మీకొక తురగమును, మనిషిని యిచ్చి, మిమ్ముల గుఱించి యొకలేఖ వ్రాసి యిచ్చెద. నే నింకను రెండుమూడుదినములవఱకును రాను. ఈలేఖం గొనిపోయి మాజనకుని కిచ్చితిరేని, మిమ్ముల తగుమ ర్యాదలఁ జేసి, నే నచటి కేతెంచిన తదనంతరంబ మీశపథముల నెఱవే ర్పఁగలఁడు. మీర లీయశ్వముపై నధిష్టింపుఁడు."

కార్తాః—"రంగరాజా! నీవు రాజపుత్రుఁడవు. నడచి యెఱుఁ గవు. నీపాదము లతిమృదువులై నవి. నీవే యీతురగముపై నారోహిం పుము. నే నీవెంట వచ్చెద."

రంగ:— "మహానుభావా! ఎంతమాటంటిరి? మిమ్ముల నడపించి నే తురగముపై నారోహించుట న్యాయంబే నాపాదము కొంతదూరమునడచిన నొప్పించునంతటి మృదువులైనవికావు. మీరేమారుమాటాడక, నాయం దనుగ్రహముంచి యధిష్టింపుడు."

అంతట కార్తాంతిభీకరుఁ డశ్వారోహణముఁ జేయఁగనే. రంగరాజాదులందరను దాపుననేగల "చాంపేయ" మను పల్లియకేగి, ఆయూరి కరణమింటికేగిరి. ఆతఁడు రంగరాజును చక్కగా నెఱుఁగును. కావున వారల కెల్లరకు నుచితమర్యాదలఁజేసి, భుజింపనియమించి, గోక్షీరమును దాహంబిచ్చి, మంచములాదిగా పరుండు వస్తువులనిచ్చెను.

ఆనాఁడు వారెల్లరును గాఢముగా శయనించిరి. వేకువాతను రంగరాజు నిదురనుండి మేల్కాంచి, కరణమునులేపి, వారందర మానాఁడేగెదమనిచెప్ప- అతఁ డందుల కొప్పమి, కార్తాంతిపరభీకరుని నిదురనుండ మేల్కొలిపి, యన్నముంబెట్టించి, లేఖనువ్రాసి, గుఱ్ఱమును సేవకునియిచ్చి వారల హైదరాబాదునకు సాగనంపెను.

వారహస్కరకిరణవారము హెచ్చకుండగనే, హైదరాబాదుఁ జేరవలయునని విసవిస్తఁబోయిరి. కాని వారల పరాహ్ణము రెండుజాములు తిరుగునరికిగాని, పురముఁ జేరలేకపోయిరి. అంత టాయూర రంగరాజుగారి గృహముం గనుగొని యచటికేగిరి. అంతట సేవకుఁడు రంగరాజిచ్చినలేఖను రంగరాజునకియ్యగా దీసికొని, చదివి, కార్తాంతిపరభీకరునకు నమస్కరించి, యుచితాసనమిచ్చి, కూర్చుండబెట్టి, రెండవసారి. భుజింపరనుసంగతి యెఱింగినవాడై, ఫలహారములదెప్పించి, యిచ్చి, మంచిజలమునిచ్చి యొకగదియందు పాన్పునిచ్చి, వానివాంఛఁ దీర్చెదనని తన కుమరుం డరుదెంచువఱకును వేచి యుండవలెననియు, సంగతి రహస్యముగా నుంచవలెననియుఁజెప్పె. అతఁ డీరీతిగ వేళకు భుజించి, ఫల

హారములంజేయుచు, సౌఖ్యముగా నా హైదరాబాదు మహాపట్టణంబున రంగరాజగృహమందుండె.

రంగరాజాదులు లాపూట కాపల్లియందుండి సాయంత్రము మూఁడుగంటలకాలమునఁ బయలుదేరి, బాటసాగించిరి. వారలు శారద వృలంబడియు, కుధరములమధ్యనుండియు నడచి నడచి యెట్టకేలకు రాజ మార్గమునంబడి నడవసాగిరి, కాని కొంతదవ్వేగిన తదనంతరము నారా యణదాసు రంగరాజును గాంచి యిట్లనియె.

నారా:—« రంగరాజా ! ఇక్కడకే మిక్కుటమగు ప్రొద్దుపోయి నది. సుమా రారుగంటలువైచిరి. అందు చీకటికాలము. రాజరస్తానుఁ బోయిన త్వరితగతి యూరుఁజేరలేము. ఇంకను నాలుగుపరుగులు బరు వుగా నున్నది. అడ్డదోవనుబోయిన త్వరితగతిం జేరగలము. అటులైన రెండుపరుగలుమాత్రమే కలదు. ”

రంగ:—అటులైన యటులేకానిండనెను.

ఈవిధమున నారాయణదాసు వారలనపథమునం బెట్టికొనిపోయె ను. వార లొకపరుగుదూరమేగునరికి రంగరాజు వెంటనంటివచ్చిన మడే లునకు పాదమందు కంటకము జొచ్చెను. అందుచే నాతనికి నడవఁ గా ళ్లాడలేదు నెత్తురు వరదలై కారుచుండెను. రంగరాజునారాయణదాసాదు లనాగవలయుననియు, పొద్దుపోయినది పల్లియఁజేరవలెనని చెప్పిననుయూఁగ కుండగనేమఁుండేగిరి. అప్పుడేరంగరాజుహృదయమందు రాయపడెను, కాని మరల ధైర్యముఁదెచ్చుకొని, సేవకునిపాదమునుండి కంటకమును, నెమ్మ దిగను బాధకలుగకుండగను నూడపెరికి, నొప్పిచే వసువంజాలక బాధపడు చున్న వానికాలికొక తృణపత్రముఁగొనివచ్చి, రక్తమునుదుడిచి, భద్ర ముఁగలనయశ్వముపై నెక్కించి, కానున్నదికాకమానదని డెందమునఁ ధై ర్యముఁదెచ్చుకొని నసువసాగెను. వారలొక పరుగేగునరికి, ధగధగ దీప

ములచే మెరయుచు దేదీప్యమానముగా నొక నిశాంతము వారల నేత్రములఁబడెను. ఇంతలో నావ స్త్యమును సమీపించిరి. ఎల్లెడచూచినను పూరిండ్లు కలవు. సుమా రరువదిపూరిండ్లు, నొక్క భవనమును కలదు. అంతటవార లూరుచొచ్చి, యొకరి కుటీరమున కేగి. యాపల్లియ పే రడిగిరి. అంతట వారలా పల్లియపేరు "నాగులగూడె' మని నుడివిరి. వీ రిటుల సంభాషించుచుండఁగనే యొకఁడు నాగులవద్ద కేగి. "యెవరో రంగ రాజట! హైదరాబాదుదివానుగారి కుమరుఁడట! గొప్పవాడట! సేవకుని తోడ నరుదెంచినాఁడని చెప్పిరి. అంతట నాగు లైదుగుర తారుణ్యవంతుల తనవెంటఁబెట్టుకొని రంగరా జధిష్టించియున్న తిన్నెయొద్దకరుదెంచి యిట్లనియె.

నాగు:—"అబ్బా! నీ దేయూరు? ఎచ్చటనుం డెచ్చటకేగు చున్నావు?

అంతట రంగరాజు నాగులు ముఖమును పారజూచి, పరిపంచి మాయ కాశ్చర్యముజెంది. "అహో! నే నాయూరనుండి బయలుదేరిన దాదిగా. నారాయణదా సని మారునామముఁ బెట్టుకొని, మనమున కింపగుపలుకులఁ జెప్పుచు, తుద కీపనిఁ జేసెకదా? అహో! దైవమాయ, ఇప్పుడు చింతించిన ఫలము లేదు. పూర్వజన్మమున మన మట్టిఫలముల నిచ్చు విత్తులపంట చేనునందు వి త్తినారము. ఇప్పు డావిత్తులు పెరిగి పెద్దవై పండినవి. వాటి నిప్పు డనుభవించుచుంటిమి. కావున దుఃఖించిన ఫలము లేదు. బుద్ధిమంతున కేదేని విపత్తు సంభవించినయెడ, దానినుండి యంజవేయుటకు యత్నించును; కాని దుఃఖసాగరమునఁ మునిఁగియుండడు. కావున వాని ప్రశ్నములకు తగుయుత్తరువుల నిచ్చి, యిచ్చటినుండి దాటెద" నని యనుకొని నాగులు ప్రశ్నముల కుత్తరువుల నిచ్చెను.

రంగ:—"నాగులూ! మాయూరు ప్రస్తుతము హైదరాబాదు

నగరము. మానివాసస్థల మసలు సువర్ణనగరము. మాజనకులు హైదరా
బాదునైజాముగారియొద్ద ప్రధానమంత్రులు. నాకొఱకై నొకసేవకుని,
పంపె. తత్కారణమున, నే నిప్పుడు మాస్వస్థలమగు సువర్ణనగరమునుండి
బయలుదేరి హైదరాబాదునకుఁ బోవుచున్నాఁడ. నీఖ్యాతి నే నెఱుఁ
గుదు. కాని నేటికి నాయందు కరుణ యుంచి వదలిపెట్టుము."

నాగు:—"అబ్బో! మీరై తేవదలమంటూయున్నారుకాని, మీ
యుక్తి నాకుఁ దెలుసు. మీరక్కడ కేగి బాబుగారితో జెప్పి, సైన్య
మును బంపి, నాగూడెమును కాల్పింపవలె నని యత్నించుచున్నారు."

రంగ:—"ఓరీ పిచ్చివాఁడ! నాగులూ! నీవు నన్నిప్పుడు విడచిన,
నీవు నాకెంతో యుపకారము జేసినట్లే. అట్లు విడచిన, నీకపకారముఁ
జేతునా? ప్రపంచమం దెవ్వఁడును బుద్ధిమంతుఁడైనవాఁ డుపకారము
సలిపినవాని కపకారము సలుపడు."

నాగు:—"అయితే సరేలెండి; మీరు నాకిప్పుడు మీకుగాను
యిరువదివందలును, మీసేవకునికిగాను యారువేల నిచ్చితి రేని మిమ్ముల
నిరువుర విడిచెద."

రంగ:—"నాగులూ! సరియే నీవడిగినయట్లు నీకు ధనమునిచ్చుట
కేమియు సంశయింపను. కాని, నాయొద్ద నిప్పు డించుకయైనను ధనము
లేదు. కావున నన్నిప్పుడు విడనాడిన మాయూరు త్వరితగతి నేగి, రహ
స్యముగా మాజనకుని కెరుకలేకుండ, నీకు నూటయిరువదివందల రూపా
యల నంపెద."

నాగు:—"రంగరాజా! నాకటులఁ బనికిరాదు. ఏదియో యొక
యూరిలో నున్నట్లును, యేదియో యొకకృత్యమునకు సొమ్ము కావలె
ననియు మాత్రి మొకలేఖను వ్రాసి, యీసేవకునిచే నంపి తెప్పింపుము
మఱిమొందు వ్రాయకుము. వ్రాసితివేని మీజనకుఁడు నాగూడెముపై

సైనికుల నంపు. ఆసైనికులు వచ్చుచున్నారని యెరుఁగఁ దెలిసినతోడనే ముందుగ నిన్ను బొడిచి చంపెద. ఆవల మావిధి యెట్లున్నదో యట్ల యగు" ననెను.

రంగ:—"నాగులూ ! అట్లే కానిమ్ము. కాగితమును కలమును దెప్పింపుము. లేఖను లిఖించి సంసిద్ధముగా నుంచి వేకువను సేవకునిచే బంపవచ్చు" ననెను.

అంతట నాగులు కలమును కాగితమును కొని రాగా, రంగరాజుత్తరమును వ్రాసెను. అప్పుడు నాగులాతఁడు వ్రాసిన యుత్తరమును చదివి వినుపింపవలయు నని ప్రశ్నింప యాతఁ డిట్లు చదివెను.

నాగపురము,

1879 వ వత్సరము, ఆ॥ బి॥

భట్టారకవాసరము.

శ్రీమచ్చంద్రశేఖర సరసీరుహసంజాతమరంద బిందుసందోహాసాస్వాదనభరితులగు, మహారాజశ్రీ రామరాజ గజపతిరాజు బాబయ్యగారి దివ్యసముఖమునకు:—

తమ ప్రియసుతుఁడు రామరాజ రంగరాజు సహస్రదండప్రణామంబు లాచరించి వ్రాయు విన్నపములు. త॥ ఉభయకుశలోపరి మీారంపిన సేవకుఁడు చేరినతోడనే బయలుదేరినాఁడ. చతుర్దివసములకిత్రము మార్గమున వచ్చుచు తాతగారి గృహమున కేగితిని. వార లిప్పుడు సాగరమున లేరు. మామాతురునికి సాతనపల్లెయం దుద్యోగమాటంజేసి వారలందరు నచటనే యున్నారు. నే నిప్పుడు నాగపురమం దున్నాఁడను. ఇక్కడ నాకొకకృత్యమునకై నూటయిరువదివండల రూపాయ లవసరమై యున్నవి. కావున, నాయందుఁ గృప యుంచి, ధనమును యీాసేవ

కునిద్వార నంపుము. సాధ్యమైనంత త్వరితముగా నంపగోరెద. నేవచ్చు వఱకును కార్తాంతిపరభీకరుని జాగ్రత్తతో జూచుచుండఁగోరెద.

చిత్తగించవలెను.

ఇట్లు.

నీమ ప్రియతనయుఁడు,

. రామరాజు రంగరాజు.

తదనంతరము నాగులు గృహములోని కేగి, హేలను బిలచి. యన్నమును వండ నియమింప, యాతని యాజ్ఞచొప్పున వంటఁజేసెను. అంతట నాగులు రంగరాజునకు పెద్దపీటను వేయ నియమించి భోజనము నకు లేపి భుజింప నియమించి, తా నూరిలోనికి వెళ్లివచ్చెద నని సెప్పి యేగెను.

అంతట రంగరాజు కాళ్లుఁ గడుగుకొని పెద్దపీటపై నధిష్టించెను. అంతటహేల విస్తరియందు పొగవచ్చుచున్న యన్నమును, శుచికర మగు పరికరములను వడ్డించెను. అతఁడు భుజింపుచుండగా, అష్టకష్టప్రా యమునసే జననీజనకులఁ గోలుపోయి, నాగులుపాలిట నైన మన గుణ రత్నావళి గృహము దిడ్డివాకిటనుండి రంగరాజు భుజించుచున్న స్థలము వద్ద కరుదెంచెను. ఇప్పటికి మన గుణరత్నావళికి దశవర్షములు నిండినవి. చూచుట కతియింపుగను, చూపరులకు రెండవలక్ష్మియో లేక సాక్షాత్ భూలోకమున కరుదెంచిన రతీదేవియో యనునట్లుగా ప్రౌఢగాంచెడిని. రంగరాజు హృదయ మామోహనాంగిని గాంచినతోడనే చెదరిపోయెను. అతనిహృదయ మంతయు, కారుచీకటినాఁడు శీతభాను డుదయించిన తెరఁగున నుండెను, అనవనవలాడుచున్న రత్నాంగిని, అపూర్ణచందవదనే తిరిని, ఆకోకిలవాణిని, ఆసుందరాంగిని కాంచినవాని హృదయ మెంతటి కఠినమైనదైనను కరుఁగకమానదు. కావుననే యానాఁడు నల్లరాళ్లకం

టెను కఠినమగు నాగులుహృదయము కరిగినది. ఆనవమోహనాంగిని కాంచినతోడనే రంగరాజు హృదయము మారినదై, యాతనిడెంద మాబాలికయందుఁ దగిలెను. అతఁ డెట్లైనను వారలఁ బలుకరింపఁదలచి హేలను గాంచి యిట్లనియె.

రంగ:—"అమ్మా! హేల! ఈనవమోహనాంగి, యాపికవాణి యెవరు?

హేల:—(అటు నిటు నాగు లెచ్చటనైన యున్నాడేమో యని చూచి) వెక్కి వెక్కి యేడ్చి, "నాయనా! మాబ్రతు కేమనివిన్నవింతు. మాపని యెట్లో మాపనియు నట్లాయె. ఇంద్రప్రస్థమునుండి నేనును, యీబాలిక జననీజనకులును, మఱియిరువురు సేవకులును, బయలువెడలి సంపతునగరమునకుఁ బయనమైతిమి. ఇంతలో మార్గమున కొండ విరిగి పై బడ్డట్లుగా వచ్చి, కొందర హింసించి, నాయజమానుని యజమానురాలిని ధరం గూల్చి, మమ్ముల నెట్లో యిచటకు బాధింపకుండ గొని వచ్చిరి. ఆనాటనుండియు బాధింపక కావలసినవాటినెల్ల నిచ్చుచు మమ్ముల సాకుచున్నాఁడు. వీఁడు బహుకౄరుఁడు. వీఁడు ప్రపంచమున కంతటికిని కాలునివంటివాఁడు. వీని నామము విన్న ప్రజలందరును గడ గడ వడంకుదురు. మహానుభావా మమ్ముల నీయాపత్తునుండి యెట్లయి నను దాటించి, మమ్ముల పోషించి, యీబాలిక జననీజనకు లెచటనైన సజీవులై యున్నవారలేమో సేవకుల నంపి కనుఁగొనుడు" నెను.

రంగరాజునకు డెంద మాబాలికపై తగులుటంజేసి, యెట్లయిన నాబాలికను, హేలను విడిపించి, గుణరత్నావళిని వివాహముఁ జేసుకొన వలె నని యెంచెను. మఱియు, నాగులు తనను ధనమిచ్చిన వదలిన ట్లే, గుణరత్నావళిని, హేలను చెరనుండి వదిలింప యిచ్ఛగలవాఁడై, హేలను గుణరత్నావళిని చేరబిలచి "అమ్మా! హేలా! నీకును గుణరత్నావళి

కని వచ్చినభీతి లేదు నేమిమ్ముల త్వరితగతి నాతోడఁ జెరనుండి తొల గించి నాతోడఁ గొంపోయెద" నని చెప్పెను. అంతట హేల సంతుష్ట హృదయాంతరంగురాలై, దిక్కుమాలినపక్షులకు మార్గమును చూపింప దేవుఁ డున్నాఁడుకదా యని డెందమునఁ దలఁచుకొని, రంగరాజుతో నిట్లనియె.

హేల:—"నాయనా! రంగరాజా! నీవు త్తమక్షత్రియకులసంజా తుఁడవు. ఉత్తమక్షత్రియకులసంజాతులు చేసిన ప్రతిజ్ఞను మెట్టియాప దలు వచ్చినను వాగ్దానమును చెల్లించెదరు. కావున నీవు మాకుఁజేసిన వాగ్దానమును నిలువుకొనుము. మమ్ముల రక్షింపుము."

రంగ:—"హేలా! మీకువచ్చిన భయము లేదు. భయపడవ లదు. మిమ్ములను దుఃఖసాగరమునుండి దరి చేర్చువాఁడ నేన" ని చెప్పి భోజన మవ్వటంజేసి విస్తరివద్దనుండి లేచి హస్తముం గడుఁగుకొని తలవా కిలవద్ద కేగెను. ఇంతలో నాగులును వచ్చెను. వారిరువురు కొంతతడవు ప్రశంసించిరి. ఆప్రశంసయందు ప్రస్తావవశముగా రంగరాజు నాగులును గాంచి యిట్లనియె:—

"నాగులూ! నాకొక్కకోర్కె గలదు. దానిని తీర్పగలవా?"

నాగులు:—"అయ్యా! రంగరాజుగారూ! ఆకోర్కె మండి.

రంగ:—"నాగులూ! ఏమియూ లేదు; కాని నీగృహమునయున్న యామోహనాంగినికాంచినతోడనేనా హృదయముచెదరిపోయి యామెను పరిణయముఁ జేసికొనవలె నని బుద్ధిపుట్టినది. కావున మతియొక నూట యిరువది వందల రూపాయీలఁ నిచ్చెద. గుణరత్నావళిని, హేలను వద లెదవా?"

నాగు:—"అబ్బా! రంగరాజా! నే నివ్వజాల. నాకుమారుఁడైన జోగులకు దానినిచ్చి వివాహముఁ జేసెదను. అందులకే ఇంతబాగుగను

దయతోడను సాకుచున్నాఁడ. హేల మాకు వెంటనొంటుటకై యుండ వలె' ననెను.

అంతట రంగరాజు హృదయము చింతాకులమయ్యెను. ఏవిధమున వీరల నీచెరనుండి తప్పింతునా యని కొండొకతడవు చింతిల్లి, కానిమ్ము యెట్లయినను నాప్రాణములఁ గోలుపోయినను వీరల నాగృహమునకుఁ గొనిపోయెద" నని గుండె దృఢపరచుకొని, మిక్కుటమగు ప్రొద్దుపోవు టంజేసి రంగరాజునకై దక్షిణభాగగదియందు వైచియున్న పాన్పువద్ద కేగి బవ్వళించెను. రంగరాజ సేవకుఁడు వాని సమీపముననే యొకచదురుపై పక్కను వైచుకొని పవ్వళించెను. నాగులు మున్నగువారలును వారలవారల గదులలో పవ్వళించిరి. అంతట రంగరాజు సేవకుని గాంచి యిట్లనియె.

రంగ.—సేవకా! నేను వ్రాసిన యుత్తరమును నీవు వినియెయున్నావు. మనకు ప్రాప్తించిన యిడుమలును నీయనుభవమున నీకు తేటయయ్యె. ఈసంగతేమియు నీలేఖయందు వ్రాయలేదు. కాని నీవీవిషయమై మాజనకునికి మామాత మున్నగువారికిని, కార్తాంతిపరభీకరునకు నెఱిక లేకుండగవిన్నవింపుము. నీవుధనముఁ దెచ్చునపుడు వెంట నొకవంద సేవకులను కూడ గొనివచ్చి. వారల నీగూడెమునకు బయల నిలిపి. నీవంటరిగా యూరుఁ బ్రవేశించి ధనమును గొనితెచ్చి నాకిమ్ము మఱి నీవు నాయొద్ద కరుదెంచినతోడనే, గుణరత్నావళిని, హేలను గొప్పకృత్యమేదో యున్నయటుల యూరిబయట మీరలున్న స్థలము నెఱిగించి యచట కేగునటులఁ నాజ్ఞాపించెద. అంత నచటి కేతెంచినవారల నతి జాగరూకతతో కాచవలె నని మాత్రమే నీవు సేవకులతోడఁ జెప్పుము. నీవు కొని వచ్చిన ధనమును నాగుల కిచ్చి, నేను మనసేవకులున్న స్థలమున కేతెంచెద. తదనంతరము సేవకుల నందరను పల్లియపై బడి ముట్టు

డించి వారల చెరబట్ట యాజ్ఞాపించెద" నని చెప్పి యిక్కడకే మిక్కుట ముగు ప్రొద్దుపోయినది నిద్రింపమనెను. కొంతకాల మవ్వునరికి భళ్లున తెల్లవారెను. అంతట రంగరాజు సేవకుని మేల్కొలిపి, లేఖ నిచ్చి వానిని సాగనంపెను.

ఆనాఁ డుదయమతి మనోహరంబై సంతోషముగా నుండెను. ఆకాశముపై మేఘములు కమ్మెను. చల్లగా నుండెను. అందుచే నాతఁడు వినవిన నడచి జాముప్రొద్దెక్కుసరికే యూరుఁ జేరెను. అంత నాతఁడు లేఖను వానిహస్తమునం దుంచి జరిగిన వృత్తాంతము నంతను సవిస్తరంబుగా వినిపించె; అంతట గజపతిరాజుగ్రుండై, వెంటనే నూరువ్వుర సేవకులం బిలిపించి, జరిగిన వృత్తాంతమును సెప్పి, యాచరింపవలసిన విధిని, నియమించెను.

రంగరాజు గుణరత్నావళితోడను, హేలతోడను, యాతని సేవకుఁడు ధనముం గొనివచ్చినతోడనే, యూరిబయటనున్న చింతతోపువద్ద కేగవలయు ననియు, నచ్చట యాతనిప్రజ లుందు రనియు, నచటి కేగిన తోడనే వారలు, మిమ్ముల నాదరించెద రనియుఁ జెప్పెను.

ఇంతలో నాదినముననే భాస్కరాస్తమయసమయ మవ్వునరికి నూర్వురు సేవకులును నాగులు గూడెమును సమీపించిరి. అంతట నూర్వురును చింతతోపుయొద్ద నిలచిపోయిరి. ధనముఁ గొనివచ్చిన సేవకుఁడు మాత్రము గూడెములోనికిఁ బోయి, రంగరాజును దర్శించి ధనమును యిచ్చెను. అంతట హేల గుణరత్నావళిని వెంటఁబెట్టుకొని పనిపై నెచటికో యేగుచున్న వారలచందంబునఁ బయలుదేరి యూరిబయటనున్న చింతతోపువద్ద కేతెంచిరి. సేవకులు దూరమునుండి వారలఁ గాంచి, యెదురుగ నేగి తీసికొనిపోయి, నూతనవస్త్రములం గట్టించి, పాలకియం దెక్కించి హైదరాబాదునకుం గొనిపోయిరి.

రంగరాజు నూటయిరువదివందలను నాగుల కప్పగించి, తానును సేవకుఁడును బయలుదేరి చింతతోపువద్ద కేగెను. అంత రంగరాజు వారల నూర్వురపైఁ బడి వారలఁ జెరపట్టి తేవలయు నని యనుజ్ఞ నిచ్చి, తాను సేవకుని సహితముగా నశ్వముపై హైదరాబాదున కరిగెను. వీరల వెంటనే, సేవకులును నాగుల గూడెముపైఁ బడి వారలఁ జెరపట్టి హైదరాబాదునకుఁ గొనివచ్చిరి. అంతట యూరనున్న ప్రజలందరును, కారెను బోతుల చందంబున నున్న వీరల నాశ్చర్యముతోడం జూడ మొదలు పెట్టిరి. అంతట రంగరాజు జనకుఁడు గృహమునుండి వెడలివచ్చి వారల కురిశిక్షను విధించెను. అంతట రంగరాజు జనకునిఁ సమీపించి యిట్లనియె.

రంగ—"నాయనగారూ! గజపతిరాజుగారూ! పాపము వీరల నందర నురితీయుట మన కనుచితంబు. ఏలనంటిరేని, నాగులు నాప్రాణముల రక్షించె. అప్పుడు నన్నాతఁడు విడచినయెడ వానిప్రాణమున కేవిపత్తును రాకుండఁ గాపాడెద నని శపథముఁ జేసితి. కావున నాయందు దను గ్రహముంచి వారల కురిశిక్షను తొలగింపుఁడు. మఱియొక శిక్షను విధింపుఁడు. న్యాయమున వీరల విడనాడవలసినదే కాని, వీరలు దేశమున కత్యంతయపకారముఁ జేయుచున్నారు. వీరల విడచిన కార్యములేదు. ఇక్కడకే దేశములఁ దోచివేసిరి. వదలిన వారలబుద్ధి మానదు. "నేలనన పుట్టెను పుట్టిన బుద్ధి పుట్టుచుకట్టెలతోడనేకాని పోద" న్న మాటను మీరు వినియే యుందు రని" చెప్ప గజపతిరాజు వారల నందరకును జన్మఖయిదును విధించెను. అంతట సేవకులు వారల కారాగారమునకుం గొంపోయి, కారాగారమందు పడవైచిరి. ఈవార్త వెంటనే ఝురీవేగమున దేశమంతయు వ్యాపించెను. అంతట దేశమంతయు గొప్పవారలెల్లరు గజపతిరాజు చేసిన మేలునకు సంతసించి లేఖల వ్రాసిరి. వేనవేలుగ ప్రజలు కారాగారమునందున్న నాగులు మున్నగువారలను కాంచుటకై

వేలముచెట్టుక్రింద వచ్చి చూచి పోవుచుండిరి.

వీరలనందర చెరసాలకంపిన తదనంతరము, భోజనమునకు లేచిరి. భుజించిరి. అంతట గజపతిరాజు కుమారుని బిలిచి, యాబాలికను గు ఱించియు, హేలనుగుఱించియు, కార్తాంతిపరభీకరునిగుఱించియు ప్ర శ్నించె. అంతట రంగరాజు వారలసంగతినెల్లను తెల్లంబుగా వినిపించి, తాను గుణరత్నావళిని వివాహమాడవలెననియున్న తన నిజవాంఛనుఁ దెలిపెను.

గజపతిరాజు విన్నవాడై తనకుమారుని కరుణాహృదయము నకును, పరోపకారమునకును మెచ్చి, భగవంతుఁడు పూర్ణాయుర్దాయ మిచ్చుటచేతనే కదా నీచులహస్తములనుండి తప్పించుకొని వచ్చినాఁడని సంతోషించి „ నాయనా! రంగరాజా! ముద్దులకుమారా! నీవు వివా హమును యుద్ధమునకాదినిఁ జేసుకొనెదవా, లేక రణానంతరమునఁ జేసు కొనెదవా ” యని ప్రశ్నించె. అందులకు రంగరా జిట్లనియె.

రంగ:—„ నాయనగారూ! నేను యుద్ధానంతరమే వివాహముఁ జేసుకొనియెద. అబ్రాహ్మణుని వాంఛ ముందుగా నెరవేర్పవలె, లేకున్న వానికి నిద్రాహారములుండవు. కావున మనము యుద్ధసన్నాహముల మవ వలె ” నని చెప్పెను. ఇప్పటికి నిశి పదునొకగంట యైనది. అందరును గాఢముగా నిదురపోవుచుండిరి. గజపతిరాజు రంగరాజ యిష్టము చొ ప్పుననే యాచరించెదనని చెప్పి, రంగరాజును పండుకొన నియమించి, తా నును పడకగదిలోని కేగెను.

ఆనాటనుండియు గుణరత్నావళి దినదినప్రవర్ధమానయై, బుద్ధికల దియై, చూచువారల హృదయముల రంజింపఁ జేసెడిది. గృహమునందు రంగరాజు మాతాపితాదుల కందఱకును, బయటనుండువార లందఱకును త్సాహముఁ జేసెడిది. గజపతిరాజును, వానిభార్య సువర్ణముఖియు, వా

రలకు కుమారికలేమింజేసియు, ముందువారల కోడలగునను సంతసమునను ముఖ్యముగా నాకన్నియ ముఖారవిందముఁ గాంచియు గుణరత్నావళిని యతిగారాబముతోడను, ప్రేమతోడను, మీగడ పెరుగు మున్నగువాని తోడను భోజనముఁ నిడి కావలసినదెల్లయు నిచ్చి సాకుచుండిరి. త్వరితము గా గానమును నేర్పుట కొక యుపాధ్యాయుని చదువుట వ్రాయుట చి త్రపటముల గీయుట మున్నగు వాటిని నేర్పుట కొకయుపాధ్యాయునియు గృహమున నియమించిరి. గుణరత్నావళియు వారల గారాబమునకుతో ను, వారల కసహ్యకరమగుపనులం జేయక, వారల మెప్పించుచు, వారల ప్రేమకుఁ బాత్రురాలయ్యెను.

అహా! దైవమాయయేమి అతఁడెప్పుడును కరుణామయుఁడుకదా? ఎవరనెటులఁ జూడవలెనో యటులఁ జూచునుకదా? ప్రపంచమాతని నే త్రముల యెదుట సమానమేకదా! భాగ్యవంతులనిశిక్షించుటమాని, బీదలను దండించుటలేదుకదా? ఎవరాచరించిన కార్యములకు వారలే భాధ్యులు కాని యన్యులు కారుగదా? అయినను సద్వంశమందు సద్గుణులే జనించెదరుకాని దుర్గుణులు జనింపరు. సద్వంశ సంజాతుల కెన్నఁడును యిక్కట్టులు తటస్థించవు తటస్థించెనేని గొప్పదుఃఖములు మాత్రమే తట స్థించును. వారలట్టి దుఃఖసాగరమునంబడి కొట్టుకొనిపోయినను, వారలను దైవమంత్యమున నేజరినోచేర్చివారలకుసౌఖ్యమునిచ్చును. మనగుణరత్నా వళి సద్వంశజాత. ఆదినుండియు కష్టమననేమో యెరుగదు. కాని మధ్య కొన్ని యిడుములు తటస్థించినవి. అప్పటికైనను జననీజనకుల నుండియు యెడమైనదనియేకాని ఆప్రదేశమందును గారాబముతోడఁ బెరిగినది. త దనంతరమును గారాబముతోడనే పెరిగెను. ఎక్కడనుంచినను రత్నము రత్నముగనేయుండును గాని, బూడిదయందు బాఱవైచినను దానినైజగుణముబోఁనే?

## ఏకాదశప్రకరణము.

మఱునాఁడరుణోదయముననే గజపతిరాజు నిదురనుండి మేల్కొని అవశ్యకరణీయోచిత కృత్యముల నెరవేర్చి తలవాకిటి తిన్నెపై నధిష్ఠించియున్న కార్తాంతికపరభీకరునిఁ బిలచి యిట్లనియె.

గజ—"మిత్రమా! నీవాంధ్ర నతిత్వరితగతి నెరవేర్పవలయునా? లేక కొంతకాలమాగవచ్చునా?

కార్తా—"గజపతిరాజా! భవత్కృప."

గజప—"కార్తాంతికపరభీకరా! మిత్రమా! రంగరాజు వివాహానంతరము నీకృత్యము నెరవేర్పఁ బూనియున్నాను"

కార్తా—"నాయనా! గజపతిరాజా! అంతకంటెనేమున్నది."

గజప—మిత్రమా! రంగరాజుతో నేనీవిషయమును గుఱించి ముచ్చటించితిని కాని మీకృత్యము ముగియువఱకుఁ దాను వివాహము జేసుకొననని ప్రతిజ్ఞ బట్టియున్నాఁడు."

కార్తా—"అవునండి. రంగరాజునకు నేనన్న యంతదయకాని వివాహానంతరమే యుద్ధప్రయత్నములఁజేసి దండు వెడలవచ్చును. రంగరాజుగారి కేమియుఁ దెలియదు. ఎంతటికార్యములున్నను తాము పట్టిన కృత్యమును నెరవేరవలెనందురు. కాని నేను రంగరాజుగారి తోఁడ మాటలాడెదనులెండి."

గజప—"కార్తాంతికపరభీకరా! పోనీలెండి మన రంగరాజు కోర్కెయేమున్నదిగ నెరవేర్చుదము"

కార్తా—సరియె అట్లయిన మీయిష్టప్రకారం బాచరింపుడు యుద్ధసన్నాహములగుడు?

గజప—యుద్ధసన్నాహముల మగుట కేమున్నది. మాప్రభువుగార గునైన జాముగారు సహాయులవుదురు సేనాంగము లన్నియు మనహస్త మందే యున్నవి కదా? మఱియు నీ విషయమున నాముఖ్యప్రసంగా తకాడును విన్నకొండసార్వభౌముడును నగు నారాయణామాత్యుడు సహాయపడగలడు కావున మనము వార్తాహరుని త్వరిత గతి నక్కడ కంపవలెను.

కార్తా—అట్లయిన మీరేదినమున గమనసన్నాహులై యున్నా రు? ఏనిగమమ్ముపై కేగదలచి యున్నారు?

గజప—మిత్రమా! సుదినము జ్ఞానులగు మీరేనిశ్చయింతురు గాత మన మేకముగా బుక్కరాయుని రాజ్యమున కంతటికిని ముఖ్యనగ రమగు కళ్యాణ కటకమున కేగి ముట్టడింతము అది ముట్టడించి మనపాలి టం జేసుకొనిన రాజ్యమునంతను జయించినట్లే. మనము యుద్ధసన్నాహు లమైన తోడనే బుక్కరాయని కడకొక వార్తాహరుని యుద్ధసన్నాహు డై యుండవలయునని చెప్పట కంపుదము"

అంతట గజపతిరా జిరువుర వార్తాహరుల విన్నకొండ కొకనిని క ళ్యాణకటకమునకొకనినంపె నారాయణామాత్యుడు గజపతిరాజంపిన లే ఖను కాంచిన తోడనే విప్పి చదివిశీఘ్రముగా తన సేనాంగముల రణం బునకు సిద్ధపరచుకొని తాను సిద్ధుడై బయలువెడలి హైదరాబాదు భానువారంబునకుం జేరిరి.

గజపతిరాజును తన సేనాంగముల సిద్దపరచె. అంతట వారలంద రున్, పంచారములోడ పంకెనబాకులబల్లెములను హస్తములంబట్టి పం

గును విడిచి, పంచత్వమునకు జంకక, రానున్న పంచకరపాటులఁ మఱచి పంచభద్ర పంచ మంగళములపై నధిష్టించి మేషముపై దుమికెడి పఞ్చసఖవసంతసమునను, రయమునను పంచకమునకు దశమీదినంబున నపరాహ్ణమునం బయలు వెడలిరి. ద్వీపములకు వరూధములం దొడిగిరి. గజములపై నంబారీలనువేసి, పరిస్తోమంబులతోఁ శృంగారించిరి. అశ్వముల ను పలువిధముల శృంగారించిరి. ఇట్లాదియందు పంచమంగళముపై నారోహించి గిరగిర తనహస్తమున బాణమును త్రిప్పుచు వాహినీపతి నకు వ వానినంటి, పంచమంగళములును వానినంటి హయములును, వానినంటి వైయాఘ్ర్యములును తదనంతరము వివిధాయుధపాణులై పలువిధము లగు దుస్తులధరించి చూపరుల గుండియలు ఝల్లనిపించెడి పత్తియు, వీరల మధ్య నక్కడక్కడ హయములపై నెక్కి ఢాకాభేరీల వాయించుచు నా తూర్యధ్వనుల వలన లాతివారల సంతసించునట్లు చేయుచు ఢాకాభేరీ వాయిద్యనాయకులును శీఘ్రగమనమున వసంత సంతసమున సాంద్రారణ్యములం బడి నడిచిరి. ఈధ్వనులను కరిగర్జితంబులను రథచక్రనాదంబులను, విని యాయడవియందుఁగల మృగములన్నియుఁ బెదరి తమతమ స్థానముల విడచి పరువు లిడ నారంభించెను. పులుగులన్నియు కిచకిచ ధ్వనులఁజేయుచు నాయానోహముల నుండెగిరిపోయెను. మర్కటములు హయముల వెంటనంటియు గజముల వెంటనంటియు రథాదుల వెంటనంటియు వారలు వేయు ఫలములఁ దించు యుంచుక దూరము వచ్చెను. ఇట్లు వారలు కొంత తడవున సుమారు నిసి దొంగప్రొద్దువేళగు సరికి సాంద్రారణ్యముల విడనాడి సత్ సద్ధతినిఁ బడిరి. అక్కడకు కళ్యాణకటకము సుమారారు మైళ్లుకలదు. అంతట వారలందరును త్వరితగతినడచి పురమును దాపించిరి. పురబాహ్య ప్రదేశమున నొకయున్నతమగొక మెట్ట కలదు. వారలందరును పురమును దాపించినతోఁడనే వాయిద్యముల నాపివేసి,

యుల ప్రధానమంత్రిగా నొసరించుకొనుటకును మంత్రిత్వము తరముల ననుసరించి వచ్చుటకును దుర్మార్గులగు బ్రాహ్మణుల శిరములఁ జీసివేయుటకును స్థిరపరుపఁబడెను. ఇట్లు హరివాసరమున నరుణోదయమున తీవ్రముగా ప్రారంభమైన రణంబు భాస్కరాస్తమయ సమయమున ముగిసెను.

అంతట శత్రుపక్షములవారిరువురు నేకీభవించి మిత్రులై ఘనత వహించిన బుక్కరాయ సార్వభౌముని కళేబరమున్న స్థలమున కేగి, మిక్కుటమగు గౌరవముతోడను, వాయిద్యములతోడను, పురమునఁ నూరేగించి దహనంబుజేసి గృహంబుల కేగిరి. ఆదినమంతయు పురముమిక్కుటమగు రోదనలతో నిండియుండెను.

కార్తాంతపరభీకరుఁడు గృహమున కేగి చిరకాలముక్రింద విడచి వచ్చిన దారాపుత్రులంగాంచి వారల దుఃఖములంబాపి, మధ్య జరిగిన వృత్తాంతము నెల్లను సవిస్తరంబుగా వినిపించె. గజపతిరాజ సైన్యంబులు జయము నొందినవను సంతసమేకాని వాస్తవముగా బుక్కరాయని మృత్యువునకు వారల ప్రజలకన్నను దుఃఖితులైరి. కార్తాంతిపరభీకరుఁడే పది దినములును బుక్కరాయుని కర్మల శాస్త్రోక్తముగా సమీపమున నుండి నడపెను. అందులకు వీరరంగరాయలు మిక్కిలి సంతసించెను. వాస్తవముగా వీరల యందణుమాత్రమైనను తప్పులేదని గ్రహించెను. మహావైభవముతో బుక్కరాయని కర్మకాండ దినములు పదియు గడచెను. ప్రజలలోఁ బడిరి.

అనంతరము నీచులగు బ్రాహ్మణుల శిరశ్ఛేదముఁ జేయించిరి. పారిపోయినవారలు తిరిగి కాన్పింపలేదు. వీరల నురితీసినతోడనే కార్తాంతిపరభీకరుఁడు తనశత్రుశుద్ధిఁజేసి, తన ప్రతిజ్ఞ నిలుపుకొంటినని సంతోషసాగరమునంబడి కొట్టుకపోయెను.

పురవాసులకును, బుక్కరాయ పుత్రుండగు వీరరంగరాయలకును వినిపిం
చిరి. అంతట వారలందరును మిగుల దుఃఖితులైరి.

కాక్తాంతిపరభీకరునిపై నేరములఁ గల్పించి చెప్పిన బ్రాహ్మణుల
కు గుండియలలో గుండియలులేవు. కొందరు గృహములవిడచి కాననము
లకుఁ బారిపోయిరి. తన జనకుని మరణవార్తను వినినతోడనే వీరరంగరా
యలును వాని ప్రజలును, భటులు నతిదుఃఖములతో రణంబునకుఁ దగు
హేతువులఁ గనుగొని, హేతువులు వారలఁ దృప్తికరములైన వారలతో
సంధిఁ జరుపుటకును, లేకున్న తిరిగివారలతో రణంబుచేసి ప్రాణం
బులఁ గోలుపోయినను వైర శుద్ధిఁ జేయవలయుననియుఁ దృఢపరచు
కొని బయలు వెడలిరి. వారలారక్తనది కడకేగుసరికి గజపతిరాజు సై
న్య మతి రయమున పురమును ముట్టడించుటకై నరుదెంచుచుండెను.
వారలిరువురును యచ్చటఁ గలసిరి. అంతట వీరరంగరాయలు తనయశ్వ
ముతో ముందుకు వచ్చి నిలువఁబడి, తనకరమందున్న బాకును హస్తము
ననెత్తి, వారల నాగవలయుననియు, రణంబునకుఁ దగుహేతువులం జెప్పవ
లయునని చెప్పి వారలఁ నాపుజేసెను. అంతట వీరరంగరాయ జనకుని
పూర్వమిత్రుఁ డరుదెంచి కారణములం జెప్పి వానిని పౌరులనుఁ దృప్తిప
ఱచి, జనకుని మరణంబునకు వగవఁ బనిలేదనియు, తానే జనకుఁడనని
యుఁ జెప్పె.

అంతట వీరరంగరాయలు, తనజనకుని యాస్థానమందుండి, తనజన
కుని సొత్తంతయుఁ జెడఁదిని లేనిపోని కొండెములఁ గల్పించి చెప్పిన విప్రు
లపై మహాగ్రుండై, వారలశిరముల ఛ్ఛేదించెదననిప్రతిజ్ఞబట్టి, తత్స్వా
ర్థముఁ గ్రహింపలేని తన జనకుని కొఱకై దుఃఖించి, వెంటనే వారలతో
సంధిఁజేసుకొనెను. దీనివలన బుక్కరాయుఁడు కోలుపోయిన రాజ్యము,
తిరిగి వీరరంగరాయుల కిచ్చివేయుటకును, కాక్తాంతిపరభీకరుని వీరరంగరా

మునలపై ( బడునని యు, అంతట తటాలున వారల పైతిరుగ (బడి రణంబు జేయువలయునని యు తన సైన్యమున కాజ్ఞాపించెను.

ఆలాగుననే గజపతిరాజు సైన్యము చెదరక యే పరాజితయయ్యె ను. అంతట బుక్కరాయ సైన్యము సంతసమున వారలు పరాజితులగు చున్నారని యెంచి చెదరి వారల వెంటనంటిరి. వారలొక మైలుదూరము వెంబడించినతోడనే గజపతిరాజ సైన్యము తిరుగ (బడెను కాని బుక్క రాయుడును, వాని సైనికులు నతిధైర్యముతో పోరాడి గజపతిరాజసై నికులలో పలువురకాలలోక నివాసుల (జేసె.

ఈమాయావికారమైన ప్రపంచమునందు సుఖమ్ముల యట్ల దుఃఖ ములును వెనువెంట వచ్చుచుండును. అతిసౌఖ్య మనుభవించుచున్న వాడు నిముసములో దుఃఖితుడగు. దుఃఖసాగరమున(బడి తేలుచున్న వాడు నిముసములో సౌఖ్యమనెడి యొడ్డు(జేరును. జయమునకు సిద్ధము గ నున్నవాని కపజయము వాటిల్లు. అపజయము( బొందెదనని యధై ర్యపడ్డవాడు విజయుడగు. ఏదియెటుల నెన్నిగడియలలో మారినను యాంభగవానుడు "కారణ" మను నొక పెద్ద శక్తిని ముందు( బెట్టును కదా!

కాని జయమును పొందుటకు సిద్ధముగానున్నతరి బుక్కరాయం డారోహించిన గజము బెదరి వెనుక మరలెను. అంతనాతని సైనికులు తమ సార్వభౌముడు పరాజితుడై పోవుచున్నాడనియెంచి వారలును, తమ గజాశ్వములతోడ వెనుకకు మరలిరి. అంతట గజముపై నారోహిం చియున్న గజపతిరాజ వాహినీపతి తటాలున బుక్కరాయునిపై దుమికి, బాకుచే పొడిచి వీరస్వర్గమునకంపె.

అంత బుక్కరాయుని సైనికులందరును తమ యజమానుని దా రుణ మరణంబునకు ఖిన్నితులై, పురమునకేగి సార్వభౌమ మరణవా ర్త

మెట్టువద్ద కేతెంచి తగు నదుపాయములఁ జేసుకొనిరి. ఇంతలో భానుఁడు రత్నకాంతిని ధగధగాయమానముగాఁ దూర్పున నుదయించుచుండె. అంతవారలు యుద్ధచిహ్నార్థము వాయిద్యముల వాయించిరి.

బుక్కరాయఁడును గజపతిరాజు వార్తాహారునంపగనే రణసన్నాహుఁడయ్యెను కావున రంగరాజు సేనానాయకుఁలు వాఁయిద్యములును వాయింపగనే,నీబుక్కరాయుఁడు తన శత్రువు వచ్చియున్నాఁడని గ్రహించినవాఁడై, మహోగ్రుఁడై వాలము ద్రొక్కిన కాలాహి చందంబున బయలువెడలి రణభూమిఁ జేరెను. అంతట దారుణంబు వాటిల్లె.

బుక్కరాయుఁడు తానెట్లువచ్చెనో యటులనే తన శౌర్యముఁ జూపించెను. రంగరాజు సైన్యమాతనిని ముట్టడించెను. ఒకవైపున రథికులును, మఱియొక భాగముననశ్వభటులును, మూడవభాగమున గజభటులును, ముట్టడించిరి. నాల్గవభాగమునుండి అన, మెట్టుపైనుండి కృతహస్తు లు ధనుర్బాణముల నంపుచుండిరి. ఈవిధంబున పలువిధముల బుక్కరాయ సైన్యమునకు నొప్పిఁ గలుగఁజేసిరి కాని బుక్కరాయని బోలె యూతని సేనాంగముల నతితీవ్రముగా, వారల బాణాదులకు వెరువకపోరాడిరి అంతట గజపతిరాజు సైన్యహృదయములు తొలుతఁ నెంతటియుల్లాసముప నుండెనో యంతటి కేసుమడంగుల దుఃఖముతోడ నిండెను. జయము బుక్కరాజ పక్షమగుటకు సిద్ధముగా నుండెను. వేనవేల సైనికులు గజములు నశ్వములు మృతినొందెను. వసుంధరపై రక్తనది పారుచుండెను.

గజపతిరాజ వాహినీపతి యతిచమత్కృతి. జిత్తుల మారి. ధైర్యవంతుఁడు. కావున జయము బుక్కరాయ పక్షమగునని యోచింగినవాఁడై తనసేనాంగముల పరాజితులవుచున్నటుల నటింపవలయుననియు, బుక్కరాయఁడప్పుడు మనము పరాజితుల మగుచున్నారమనియు సూక్ష్మముగ నోడింపగల ననియుఁ దలచి యతిగయమున తనసైన్యముతోడ

అనంతరము శుభదినంబున వీరరంగరాయల పట్టాభిషేకంబతి ఘనతతోడఁ జరిగె కార్తాంతిపరభీకరుఁడు ప్రధానపరిగ్రహ పదవినిఁ బొందె.

ఇటుల చీకటిరాత్రులగడచి వెన్నెలరాత్రులు వచ్చినతోడనే, గజపతిరాజును తనసైన్యమును కార్తాంతిపరభీకరుని సహితముగా విజయులై సంతసమున సరసల్లాపము లాడుకొనుచు హైదరాబాదున కేగిరి.

కార్తాంతిపరభీకరుఁడు వీరరంగరాయనిఁ బిలచి గజపతిరాజు తనకతిప్రియమగు చెలికాడనియు ఆతనితోడనేగి వాని పుత్రుఁడగు రంగరాజ వివాహముఁ జేయించివచ్చెదననియు, నంతవరకు రాజ్యంబతిజాగరూకతోఁ బాలింపవలయుననియుఁ జెప్పి గజపతిరాజుతోడ హైదరాబాదున కరిగె.

## ద్వాదశప్రకరణము.

నారాయణామాత్యుఁడు హైదరాబాదునందు ప్రథమదినమున మాత్రమేయుండెను. ఆనాఁడు గజపతిరాజు సుచికరములగు పరికరములను, పిండివంటలను, చేయించెను. నారాయణామాత్యుఁడు గజపతిరాజు చేసిన గౌరవమునకుఁ గడుఁగడు సంతసించి మరునాఁడరుణోదయముననే బయలుదేరి విన్నకొండకుఁ బ్రయాణమై వెళ్ళెను.

గృహమున వారతి సంతసమున నుండిరి. ఇటులుండ గజపతిరాజొకనాఁడు కార్తాంతిపరభీకరునిఁ బిలచి యిట్లు ప్రసంగించెను.

గజప—మిత్రమా! కార్తాంతిపరభీకరా! మీవాంఛలెల్ల నీడేరినవా?

కార్త్తా—"మహానుభావా! గజపతిరాజా! మీకృపవల్ల నాయభీప్సితములెల్ల నెరవేరె. ఇంకేమియు కొఱఁతలేవు. మృతినొందినవానికి సంజీవినిచ్చి పునర్జీవితునిఁ జేసినయట్లు నన్ను నీతనయుఁడు పునర్జీవితుఁ జేసె. నీవు నావాంఛలనెల్ల నెరవేర్చితివి. నీమూలముగ నాప్రతిజ్ఞ లెల్ల కొనసాగె. దుఃఖసాగరమునఁ మునిగి నాకొఱకై పరితపించుచున్న నాదారాపుత్రుల దుఃఖములఁ బాపితివి. గజపతిరాజ ఘననామంబు నీకఁదగుగాని యన్యులకుఁ దగునే? నీయంతటి ఘనుఁడ నీప్రపంచమునంగాన" ననియె.

గజప—"అయ్యా! నేఁమీకుఁ జేసిన దొడ్డియులేదు. ఆభగవానుడే సకలమును నెరవేర్చినాఁడు. నన్నింతగా కొనియాడఁ దగదు. అయిన మనరంగరాజ వివాహ మెప్పుడాచరించిన బాగుగనుండెనో సెలవివ్వ వేఁడుచున్నాఁడ."

కార్త్తా—"అయ్యా! ఎవరాచరించిన కృత్యములు వారలకు లేశముగనే పొడగాంచు. ఇది మిక్కుటమగు కష్టసాధ్యమైన కృత్యమేగాని తక్కువకృత్యముగాదు. మఱియు నిక మన రంగరాజ వివాహవిషయమై తేవువచ్చెడి సప్తమీదినంబున నలుపవలయు. ఈముహూర్త్తంబు దాటిన నిక నీవత్సరము ముహూర్త్తములులేవు. ఇదిగొప్ప ముహూర్త్తము."

గజ—"అయ్యా! కార్త్తాంతిపరభీకరా! మీయనుజ్ఞానుసారమటులనే వివాహముఁ జేయనిశ్చయించినాఁడ. కావున మనబంధుగులు ముస్నగు వారికిని వీరరంగరాయ సార్వభౌమునకును నారాయణామాత్యునికిని శుభలేఖల వ్రాయించఁగోరెద."

కార్త్తా—"అయ్యా! గజపతిరాజా! అదియెంత! నిముసపని." అని చెప్పి రంగరాజు బంధుగులకు మున్నగువారలకు వెంటనే శుభలేఖలను వ్రాసిపంపెను.

ఆనాటికి వివాహదిన మూఁడుదినములుండెను. అందుచే నాయింటి వారు బాలికను పెండ్లి కొమరితనుఁ జేయుటకు పూర్వము యూర నారి కేళ ఫలములను, మిఠాయిలను బాలికను వెంటఁబెట్టుకొని పారిపంచిపెట్ట కుతూహలాయత్త చిత్తులై యొకనాఁడు బయలు, వెడలిరి. రెండుబండ్ల నిండను లడ్డుండలను నారికేళ ఫలములను పెట్టి సన్నాయితోడ పయనమై రి. వారలాయూరంతయుఁ దిరిగి యెట్టకేలకు రాజరస్తాకు వామనభాగము ననున్న పేష్కారుగారి గృహమున కేగిరి. అంతటా యింటి పాలుతి వా రలకు పీటలవైచి యుచితమర్యాదలఁ జేసి కూర్చుండబెట్టెను. ఆపెపేరు హేమావతి. గుణరత్నావళి హేమావతి ముఖమును పారజూచి తనతల్లి యని గ్రహించియు పసితనమున కాంచినదగుటచే బాగుగ గుర్తింపఁజా లక యూరకుండెను. కాని హేమావతి గుణరత్నావళి ముఖారవిందమును పారజూచితనతనయ యనిగ్రహించి దుఃఖమునాపుకొనఁజాలక, ‹‹అమ్మా! ప్రియకుమరికా! ఎన్నదినంబులకు నీసౌందర్యముఖమును కాంచితి” నని చెప్పి యేడ్వసాగెను.

అంతట గజపతిరాజ భార్యయగు రత్నాంగి ముక్కాలపీటమీఁద నుండి గుభాలునలేచి యామెవద్దకేగి తన పవిటచెంగున యాపె నేత్రబా ష్పములందుడిచి యామెదుఃఖ హేతువ నడిగెను.

అందులకు హేమావతి యాపెతోడ పూర్వవృత్తాంతంబునంతను కంట నీరుఁ బెట్టుచు చెప్పె. అంతట రత్నాంగి యాపెతో నిట్లనియె.

‹‹అమ్మా! హేమావతీ! వగవఁబనిలేదు. తిరిగినీపుత్రికను చూచి తివితదాయని సంతసింపుము. ప్రపంచమందు దుఃఖములట్ల సుఖములును వచ్చుటసహజము. మనకున్నదానితోడఁ దృప్తిఁబొంది సంతసింపవలెకాని దుఃఖింపఁ బనిలేదు. నేనిదివఱకే యీవృత్తాంతం బంతయు నాప్రియతన యుఁడగు రంగరాజువలనఁ నాలకించియున్నదాన” నని చెప్పి గుణరత్నా

వళిని తమ గృహమునకుఁ గొనివచ్చిన వృత్తాంతంబు నంతయు సాంతము గా వినిపించెను.

అందులకు హేమావతి యిట్లనియె.

"అమ్మా! రత్నాంగి! నాయుదరమున నీప్రియతనయుఁడు బాలు వోసె. నీనామంబే నీపుత్రిని గుణంబుల వెల్లడిఁజేయు. సత్కులజాతుల కెన్నఁడును సుబుద్ధులేదోఁచుచుండుఁగాని దుష్టబుద్ధులు దోఁచవు. కావు ననే నీపుత్రిడిట్టి యుపకారము గట్టుకొన్నాఁడు. అమ్మా! రత్నాంగీ! మీపుత్రినికిచ్చి గుణరత్నావళిని వివాహమాచరించెదమని నుడివియు న్నారు. సజ్జనులతోడి సహవాసంబును, బాంధవ్యమును సర్వశ్రేయ ములకు మూలమని పెద్దలు చెప్పుదురుకదా? మాకుమీతోడి బాంధవ్య ముకంటె నెక్కుడు ధనంబును శ్రేయంబును వేరొండులేదు. కావునశీఘ్ర ముగ వివాహముఁ జేయుడు."

రత్నాం——"అమ్మా! హేమావతీ! మేమాచరించిన దేమియు లేదు. అంతయు దైవకృప. దైవకృపలేమి మనమేకృత్యము నాచరింపఁజాలము. మఱియు మేమింతవఱకు కన్యకకు కన్యాదానముం జేయు తల్లిదండ్రులైన ను లేరుకదా యని వగచుచుంటిమి. దయోపనిధియగు భగవానుఁడు మీకును మాకును బాంధవ్యముఁ గూర్ప మనలకు తోడ్పడియున్నాఁడు. మీతోడి బాంధవ్యమే మీకవశ్యము కర్తవ్యము"

హేమా——"అమ్మా! పిన్ననాటనుండియు దాని జాతకఫలము మంచిదగుటచేతనే యొక్కడనున్నను సౌఖ్యమనుభవించుచున్నదని" వీర లుపంభాషించుచుండగా నిజాముగారి కొలువునుండి సింహబలుఁడు గృ హమున కరుదెంచెను. అంతట నాపాఱుతెలందరును లేచి నిలువఁబడిరి. అప్పుడు హేమావతి తనభర్తయగు సింహబలునింగాంచి జరిగిన వృత్తాం తంబునంతను సాంతముగా వినిపింప, నాతఁడు ప్రేమనాపజాలక రత్నాంగి

సామీప్యముననే నిలువంబడియున్న గుణరత్నావళిని చంకబెట్టుకొని వు
ద్దాడి మిఠాయులఁ బండ్లఁ దెప్పించియిచ్చె.

కొంతతడవైన తోడనే వారలందరును రత్నాంగి సహితముగా శకటములలో నారోహించి గజపతిరాజుగారి భవనమున కేగిరి. రత్నాం గి తనభర్తను వేరఁబిలచి జరిగినవృత్తాంతమునంతను వినిపించెను. అంతట వారలందరునుకొంతతడవుకూర్చుండిపరిసంగించిరి వివాహమునిశ్చయించిరి.

అంతట సప్తమీదినంబున, వజువాత రెండుగడియల కాలమున మిధున లగ్నమందు రంగరాజునకును గుణరత్నావళికిని వివాహము దేదీప్యమానంబుగా వర్ధిల్లె. గృహమంతయు బంధుగులతోడను, జ్ఞాతి పురుషులతోడను కిటకిటలాడెను. విన్నకొండ సార్వభౌముండగు నారా యణామాత్యుఁడును వీరరంగరాయలు నరుదెంచిరి. పంచదినంబులును పంచభక్ష్యపరమాన్నంబులునుఁవి విధపరికరములును చేసిరి. బవలులు మే జువాణీలతోడను, రేలు హరికధలతోడను కాలముఁ గడిపిరి. పంచదివస ములు పురమంతయు నన్నదాన నిలయమై దనరారుచుండెడిని. పంచదివ సములును భేరీమృగందాది వాయిద్యములతో వేశ్యానాట్యములతో బాణసంచాతో నూరంతయు నూరేగించిరి. ఆపంచనిశలును పంచదీపావళీ పండువుల చందంబున పొడగాంచె. తల్లిదండ్రులు కన్యాదానముఁజేసిరి. ఇట్లయిదుదినంబులును దేదీప్యమానంబుగా గడచె. ఆరవ దినంబుననే ప లువురు బంధుగులు తమ తమ స్థానములకేగిరి. నారాయణామాత్యుఁడు ను యానాఁడే విన్నకొండకేగెను. కాని కార్తాంతిపరభీకరుఁడును వీరరంగ రాయలును పదునారవ దినపు పండువ గడచువఱకునుండిరి. పదు నారవ దివసపు పండువ గడచెను. అంతటనుదినంబున వీరరంగ రాయలును, కార్తాంతిపరభీకరుఁడును హైదరాబాదునుండి పయన మై, గజపతిరాజాదుల గుణంబులఁ గొనియాడుచు కళ్యాణకటక పట్నం

బుఁడై, రాజ్యంబూర్జితంబుగా పరిపాలించుచు, ప్రజానురంజకుఁడయ్యె. చోరత్వము మున్నగు దుష్టకార్యముల నశింపఁజేసి ప్రజల కెల్లరకును సౌఖ్యంబిచ్చె. కాన్తాంతిపరభీకరుఁడును రాజ్యభోగంబుల ననుభవించుచు, నృపులరంజింపఁ జేయుచు ప్రధానమంత్రిపదమున నుండె.

హైదరాబాదునందు రంగరాజు గుణరత్నావళియు దినదిన ప్రవర్ధమానులై, సుబుద్ధులై, సుపుత్రులంబడసి, యాయురారోగ్యాభివృద్ధిం జెంది సౌఖ్యమనుభవించుచు తమ జననీజనకుల హృదయముల రంజింపఁ జేయుచుండిరి. గుణరత్నావళి తనయత్తమామల కనుగుణ్యయై వర్తించుచు, వారలకును భర్తకును సేవఁజేయుచు పతిభక్తి కలదై నామము సార్థకముగాంచెను.

గద్యము:—ఇది శ్రీమద్రామచంద్ర భక్తాగ్రగణ్య, కవితా పవిత్ర,
వెదురుమూడి వంశోద్భవ, కాస్పసగోత్ర రామదాస కృష్ణాబా
యమ్మ సుమనుమ గుణకమలాంబ గర్భశుక్తిముక్తాఫల
తిరుమల రాయ జ్యేష్ఠపుత్ర, మద్ధ్యకులపావన,
అంగరపురివాస, విబుధవిధేయ రామ
లక్ష్మీనృసింహ విరచితమగు
గుణరత్నావళి
సంపూర్ణము.

# శ్రీదేవి.

పెద్దాపుర సంస్థానచరిత్రవిషయికనవల. విజయనగరం పెద్దాపురం సంస్థానముల మర్యాదలు రాచటెక్కులు ఇందు మనోహరముగ వర్ణింపఁబడినవి. క్షత్రియమర్యాదను సూచించు నీనవల అతి మనోహరమైయున్నది. కొద్దిప్రతులు మాత్రము ముద్రింపఁబడినవి. త్వరపడుఁడు.

వెల రు 0-10-0.

# కళాసుందరి

ఆంధ్రదేశమునకు సంబంధించిన రెండవశతాబ్దమునాటి ఆంధ్ర చరిత్రవిషయిక నవల. చిలుకూరి వీరభద్రరావుగారిచే వ్రాయఁబడినది. కర్ణి సామ్రాజ్యవైభవము, పూర్వపుఆంధ్రుల ధైర్యసాహసములు వర్ణింపఁబడినవి. ఇట్టినవల ఇదివర కాంధ్రభాషలో లేదు. ముమ్మాటికిని లేదు.

వెల రు 0-10-0.

కలయువారు—

మానేజరు—ఆంధ్రసారస్వత నికేతనము

రాజమహేంద్రవరము.

